# కృతిసమర్పణము:



ఆసేతుకనకగిర్యంతరపుణ్యతీ
　　　　ర్థంబులఁ గ్రుంకిన ధన్యశీలుఁడు
వెంట నంటినయర్థి వృథఁగాఁబోనీక కృ
　　　　తార్థుఁజేసిన సద్వదాన్యశీలుఁడు
రామానుజ యతిబోధామృతాసార సం
　　　　వర్ధితాత్ముండు సద్వైష్ణవుండు
ఆచార్యుఁడై వైష్ణవారాధనంబునఁ
　　　　దనియని నిరతాన్నదానపరుఁడు

భక్తపాదాబ్జసంతతార్చననామ
భాసితుం డగుజనకుని పాదపద్మ
నికటమునను 'రామపరివాసకృతి' సుతుఁడు
రంగనాథుండు కృతిసమర్పణముఁ జేసె.

# ఉపోద్ఘాతము.

పాఠకమహాశయులారా !

శ్రీవాల్మీకిఋషిపుంగవునిచే రచింపఁబడిన శ్రీమద్రామాయణ మును నాశక్తికొలఁది నాటకరూపమున రచించి యాంధ్రవిద్వల్లోక మునకు సమర్పించుబుద్ధితో నేనేనిమిదిసంవత్సరములక్రిందట వీనిలోఁ బ్రథమనాటకంబగు 'శ్రీరామబాల్యము'ను రచించియుంటిని. 'శ్రేయాంసి బహువిఘ్నాని'యనునట్లు తదుపరి నాప్రయత్నమున కనేకాంతరాయములు కలుగుటచే 1933 వఱకుఁ దీనికి కలముఁబట్టుట సమకూడదయ్యెను. 1933 సెప్టెంబరులో నేను తీవ్రతాపజ్వరగ్రస్తుఁ డనై మృత్యువు రెండుకోరల సగము చిక్కి నాజన్మసార్థకముఁ జేసికొను టకై రచింపఁగడంగిన శ్రీరామనాటకపంచకముఁ బూర్తి చేయలేక ముం గింపవలసివచ్చెనుగదా యని యెంతో సంక్షోభించితిని. అయినను భక్త రక్షప్రముండగు శ్రీరామచంద్రుని(యిది నేను సవ్యాజమని తలఁపనం దున) నిర్వ్యాజకృపచే నచిరకాలములోనే పూర్ణారోగ్యవంతుఁడనై న వెనువెంటనే వానిని దిరిగి వ్రాయఁగడఁగి 'యాశ్రీరామప్రవాస ము'ను 1-7-'34 నుండి 26-9-'34 లోఁ బూర్తిచేసితిని. కాలపరి పక్వము కానిదేదియు సమకూడదుకదా! దీనిని నేఁటికి ముద్రింపించి యాంధ్రలోకమునకు సమర్పింపఁదోడ్పడిన శ్రీరామచంద్రమూర్తికిని, మాటమాత్రంబున నీనాటకంబునకుఁ దొలిపలుకు వ్రాసియిచ్చిన యస్మన్మిత్రులును, శ్రేయోభిలాషులునై 'గుంటూరుసాహిత్యమండలి' సభ్యులలో నొకరగు మ. రా. రా. శ్రీ. కొమరవోలు నాగభూషణ రావుపంతులుగారికిని, దీనిముద్రణభార మంతయు వహించి ప్రూఫుల నరిచూచుటలో నాకనల్పసహాయ మొనరించినయనేకనవలానాటకక ర్తలును గుంటూరువాస్తవ్యులు నగు మధ్వశ్రీ పళ్ళె వేంకటసుబ్బా రావుపంతులుగారికిని నాకృతజ్ఞతాపూర్వకవందనము లర్పించుచుఁ బాఠకమహాశయుల కీశ్రీరామచంద్రగ్రంథమాలాద్వితీయసిరి నమర్పించు

శ్రీరామానుజ భవనము
ఒంగోలు
8-1-'36.

విద్వద్విధేయుఁడు,
ఆమూరి వేంకటరంగస్వామి అయ్యంగారు,
గ్రంథకర్త.

# ఒక్కమాట

నిఖిలకల్మషహారంబును నిరంతర పుణ్యప్రదానకంబును నగు శ్రీరామనామస్మరణామృతపాన మైహికాముష్మికసుఖంబు లఖిలమీయును ప్రతిమానవునకును శిరోధార్య మగుపరమధర్మము. సంసారసాగర గర్భమున బహుళదుఃఖార్తిభరంబుచే సంతతము స్వస్థానచ్యుతుం డై దైన్యదశాక్రమంబున గ్రుంగిపోయిన యీమనుజజీవికి సముద్ధర్త మాత్ర శ్రీరామ నామస్మరణ మెంతటిసమధికశ్రేయోత్సాహములను విశిష్టముగు నానందమును బ్రసాదించునో పుణ్యాత్ములగు ననుభవశాలురకు మాత్రము సువిదితము. అట్టిమహిమ సకలలోకపూజనీయంబును భవబంధవిమోచనకారియు నతిపవిత్రమును బుణ్యశ్లోకి వాల్మీకి విరచితము నగు శ్రీమద్రామాయణ దివ్యసంస్కృతకావ్యమును ననుసరించి యాంధ్రనాటకరూపమునఁ గీర్తనముఁ జేయుట కైహికవిశేషమును బరిత్యాగముఁ జేసికొని మామిత్రుండు విశిష్టాద్వైతపాలకులగు శ్రీమాన్ అమూరి వేంకట రంగస్వామి అయ్యంగారు పొందిన శ్రీహర్షసంపూర్ణ మస్మదాదుల కతిదుర్లభమును దుర్నిరీక్ష్యమును. ముఖ్యముగా కరుణారసప్రపూర్ణ మగు సీతారామప్రవాసఘట్టమునం దాతఁడు భక్తిరసవిగాహితుఁ డగుచుఁ దన్మయుఁడై తాండవించినాఁడు.

ఈనాటకమునందలి గుణాగుణవిమర్శనము కవిత్వతత్త్వవిశారదులును, నాటకకళాకోవిదులును విజ్ఞులు నగుపండితప్రకాండులకు విడువఁబడినది. కించిజ్ఞుఁడ నగునేను మాత్రము దీనిని శ్రీరామభక్తిపారవశ్యముచే మత్తిల్లిన ఆత్మయొక్క భవ్యగానవాహినియని తలంతును.

పిన్ననాఁటనుండియు భక్తిబీజములకు హృదయక్షేత్రమున దోహదమొసంగుచు వచ్చిన ఈకవికుమారునియైహికక్రీడాకలాపములకు లక్ష్మీసరస్వతు లిరువురును వశవర్తిను లగునట్లు శ్రీరామచంద్రప్రభు వనుగ్రహించినాఁడు. ఆమహాప్రభువనుగ్రహంబున నీతఁడు చిరాయురారోగ్యవంతుఁడై ఆధునికకవితాపద్ధతుల ననుసరించి సారస్వతకృషి సల్పుఁగాక యని కోరుచున్నాను.

యువ మార్గశీర్షము
పూర్ణిమ.

కొమఱవోలు నాగభూషణరావు.



## ఈనాటకమున వచ్చుముఖ్యపాత్రలు.

**అంకము 1.**

వశిష్ఠుఁడు
దశరథుఁడు
సుమంత్రుఁడు
సామంతుఁడు
పౌరుఁడు
జానకి
మాలతి
మంజరిక
శ్రీరాముఁడు
అరుంధతి

**అంకము 2.**

మంథర
మంజరిక
శనిగ్రహము
కైక
దశరథుఁడు
శ్రీరాముఁడు
లక్ష్మణుఁడు
జానకి
సుమంత్రుఁడు
కౌసల్యా, కైకా, సుమిత్రలు
వశిష్ఠుఁడు

**అంకము 3.**

శ్రీరాముఁడు
జానకి
లక్ష్మణుఁడు
సుమంత్రుఁడు
పౌరులు
గుహుఁడు
నాగులు
ఋషికుమారుఁడు
భరద్వాజుఁడు
వాల్మీకి

**అంకము 4.**

భరతుఁడు
శత్రుఘ్నుఁడు
ఆర్యుఁడు
వార్తావహుఁడు
మంథర
వశిష్ఠుఁడు
సుమంత్రుఁడు
కౌసల్యా, కైకా, సుమిత్రలు
గుహుఁడు
శ్రీరామ, లక్ష్మణులు
జానకి
జాబాలి
సామంతుఁడు

**అంకము 5.**

ముప్పదిమునులు
మునిపత్ని
శ్రీరాముఁడు
రాక్షససేనాని
ముప్పదిరక్కసులు
లక్ష్మణుఁడు
జానకి
శూర్పణఖ
రావణుఁడు
మారీచుఁడు
నారదుఁడు

శ్రీ

# శ్రీ రామపవాసము

—* నాంది *—

చ. జనకునిమాట నిల్పు ననుజన్మునికి న్పితృరాజ్య మిచ్చి, తా
వనికిని భార్యతోడ ననువర్తను సోదరుతోడ నేగియు
న్దనుజులమాయ కొన్నవిఘ్నంబున జానకిఁ బాసి సత్తపో
జనములఁ బ్రోచు రామనృపచంద్రుఁడు సభ్యుల నోముత న్సదా.

(నాంద్యంతమున సూత్రధారుఁడు పుష్పాంజలియై ప్రవేశించి
సభ్యులపైఁ జల్లి)

సూ:- ప్రేయసీ! నటీ! సత్వరము నాటకరంగమునకుఁ జేని పాత్రముల నాయత్తపరచుమున నింకను కాలవిలంబన మొనర్చుచున్నావా?

న:— (ప్రవేశించి) నాయాలస్యము సైరింపుడు. పైతృక మగునాస్తి విషయమై నాస్వాంతతమ్ముఁడును, నాసపత్నీమాతకొమరుఁడును వివాదమాడుచుండఁగా సమరసపెట్టి వచ్చువఱకు జాగయ్యె.

సూ:- తరుణీ! ఇప్పుటఁ గాకుండినను మఱియొకచోట నాటకప్రారంభ మొనర్చియే వచ్చినావే.

తే. గీ. జ్ఞాతివైరంబు ధరణిపై సహజ మగుచు
వారివారలయధికారవశతఁ బరగు
రాజ్యకాంక్షచే నృపులు వైరంబుఁ బూన
నల్పములకడ సామాన్యు లరు లగుదురు.

న:— నాథా! ఇది లోకవర్తనముకదా?

సూ:- పోనిమ్ము. ఇఁక నేమాత్ర మాలస్యము సేనను. పాత్రముల నాయత్తపరచితివా?

న:- నాథా! సర్వము సంసిద్ధమే. నేఁడు సభ మనోరంజన మొనర్చుట చేఁ గృతార్థత నొందనున్న నాటక మేదియో వక్కాణింపుఁడు.

సూ:- ప్రేయసీ! నీ వింతకు ముందే నాంది వింటివికదా?

న:— శ్రీరామప్రివాసమా యేమి!

సూ:_ నీలాటి పరేంగితావగాహనచణ యగునర్ధాంగి చేదోడై యుండ నే నెల్లెడ సఫలీకృతయత్నుఁడ నేకదా!

న:— నాథా! కవినామముఁ దెల్పుఁడు.

సూ:- చెలీ! తెలుపుచుండులోననే త్వరయా?

ఆ. వె. హారితగోత్రుఁడైన ఆదూరి వేంకట
రంగనాథకవి నెఱుంగ వా?
"విజయసింహ" "రామవిభునిబాల్యము"ను, "రా
మప్రివాసము"ను క్రమముగ వ్రాసె.

అనుకూలవర్ణనచేఁ గర్ణరసాయనముఁజేయుము.

న:- లయగ్రాహి. శ్రీకరములౌ కళలఁ గోకనదవైరి విర
హాకులుల మారుగతిఁ గాకలను మున్వక
గోకము వియోగమున శోకిలుచు నయ్యినుని
రాకతమి యుల్లమున వే కలవరింపక
జీకటినిఁ బోల్మ్రగిలుఘాకకును వెన్నెల చి
కాకుగ జగంబులను వ్యాకుల మొనర్పక
లోక మమృతాంశునివిలోకనము లోఁ దలఁచు
నాకలువ శోకుగమి జోకఁ దలపించుక.

సూ:- వహ్వా! నీబుతువర్ణనము ప్రదర్శింపఁబడఁబోవునాటకమున కెంతయు ననుకూలముగ నున్నది. (వినుట నభినయించును)

(తెరలో)

తే. గీ. వార్ధకంబున శ్రీమవాయ వనధిఁబొచ్చె
రవి యుదుగో పూర్ణచంద్రుండు రాఁదొడంగె
రాజ్య మినవంశభవదశరథుఁడు వాయ
రామచంద్రుండు ప్రభు వగురమణ శోప.

న:_ నాథా! వింటివా రామరాజ్యవాంఛితుఁ డగువృద్ధకంచుకి వాక్యము! దశరథమహారాజు సభకుఁబోవుచు నీత్రోవనేవచ్చుచున్నాఁడు. మన మిఁక పోవుదము.

సూ:_ సరియే. (ఇది ప్రస్తావన)

# ప్రథమాంకము.



1. స్థలకము — అయోధ్య. దశరథునికొలువుకూటము.

(సుమంత్రుఁడు, వశిష్ఠుఁడు, దశరథమహారాజు, పౌరుఁడు, సామంతుఁడు-ఉచితాసనాసీనులై యుందురు.)

ద:— గురువర్యా ! ఇంతకు ముందు తమకు మనవిఁజేసికొనినప్రకారము శ్రీరామపట్టాభిషేకవిషయమున సభాస్తారుల యభిప్రాయముఁ గనుఁగొన యత్నించెద.

వ:— రాజా ! అటులే కానిమ్ము.

ద:— అమాత్యశేఖరా ! సామంతపౌరులారా ! నా కిప్పట్టున సముచితమార్గదర్శకులై కర్తవ్యము బోధింపుఁడు.

ఉ. ఆగురువు ల్శాసించుగురునాజ్ఞను, ధీమతి యైనమంత్రి వెం
టై గమనింప, రంగ దరు లందరు నిత్యము నైరికాపులై
సాగిలుచుండ, భూప్రజలు స్వామి వలెన్భయభక్తిఁ గొల్వ నె
ట్లో గడచె న్సభాకృతి నిటు ల్గుడువ న్బనియేమి యింకనుఁ ?

ఉ. శంబరముఖ్యరాక్షసులఁ జంపి జగంబులు పొందుచున్నక
ష్టంబులఁ బాపినాఁడ, మునిసంఘసుఖం బొనఁగూర్చినాఁడ, స
ప్తాంబుధు లెల్లలై పరగునట్టిధరిత్రి జయించి యేకరా
జ్యం బొనరించి చేసితిని జన్నము లెన్నొ సురల్ నుతింపఁగన్.

క. కలకాలము లేకున్న, న
తుల తేజులరగుచు రాజ్యధూర్వహులౌ పు
త్రులు చేతి కెక్కివచ్చిరి
యిల నింకను నే భరింప నేటికి చెప్పుఁడీ ?

అందున నగ్రజుండగు శ్రీరామునివిషయము నే వేఱుగాఁ జెప్పబనిలేదుకదా !

తే. గీ. సత్యనిరతుండు, నసహాయశౌర్యధనుఁడు
నీరజాంబకుఁ, డేకపత్నీవ్రతుండు
కువలయానందసంధాయకుండు, రామ
చంద్రువిషయము నెఱుఁగరే ? సభ్యులార !

అదియునుఁగాక యప్రతిమానశౌర్యంబున పశుపతిధనువు ఖండించి, పరశురామభంజన మొనర్చి రోహిణీయుతరాకాసుధాకరునిపగిది మైథిలీయుక్తుఁడై తండ్రిని మించినకొమరుఁడైన శ్రీరామచంద్రునిపై నీరాజ్యభారము మోపి పితృపితామహులవలె వానప్రస్థ మొనర్ప బుద్ధిపొడముచున్నది.

ఆ. వె. తరుణుఁడైనకతిని దశరథుపైఁ గల్గు
ప్రేమ రామునిపైని ప్రీతిఁజూపు
రాజ్యరమయుఁ, బ్రజయు రహి, యది యెంతయు
సంతసంబె నాకు సభ్యులార !

వ:— అయినను మహారాజా ! అంతటిత్వరయేల ?

తే. గీ. రాజ్యకార్యము దీర్ప దార్ఢ్యంబు గల్గు
నఱకు రామునిపై రాజ్యభార ముంపఁ
గారణం బేమి ? మఱికొంతకాల మతఁడు
సుఖ మనుభవించుచుండఁగఁ జూడలేవో ?

ద.— గురువర్యా ! అదికాదు. ఎన్నడైనను నేఁదపోవనమునకుఁ బోవుటయు, శ్రీరామునిరాజ్యాభిషేక మొనర్చుటయు జరుగవలసినవేకదా ? అరువదివేలసంవత్సరములనుండి నే నొకఁడనే ప్రభుత్వముఁ జేయుచున్నందున నయోధ్యానివాసులును తక్కుంగలనాగరజనులును నూతనపట్టాభిషేకమహోత్సవదర్శన లాలసులై యున్నారు. కావున అసహాయశూరుఁడగు శ్రీరామచంద్రుఁడు పట్టాభిషేకయుక్తవయస్కుఁడైనందువలన వారి కోర్కె సఫలమొనర్ప నిచ్ఛపొడముచున్నది.

తే. గీ. వృద్ధుకంఠెను తిరుణుఁడౌ విభునిమీఁద
ప్రేమఁజూపెడిఁగాదొకో వెలది సతము ?

సు:— రాజా ! సతీమతల్లులవిషయ మట్టిదికాదు ? కదా !

ద:— రాజ్యరమ చంచల యగుకారణముచేతఁ
దరుణుఁడౌ రాముఁ గోర వింతయె ? వచింపు.

వ:— (నవ్వును)

సు:— బాగుగ సెలవిచ్చితిరి. ఈరాజ్యలక్ష్మి మిగులచపలయు, విశ్వాసఘాతకురాలును. ఏలయన

మ. కరుణాలోకనచేతఁ జేసనయిన న్స్వామినాథుఁ గావించి, బం
ధురసౌఖ్యాంబుధి నోలలాడఁగ సమర్థుం జేయుఁ, గాదంచు ని
ష్ఠురదృష్టి న్గనెనా తిరుండయి బలిష్ఠుం డైనపృథ్వీశు, సం
గరమందో, వనిలోననో విడిచి భిక్షాపాత్రుని న్జేయుదే ?

వ:— కావుననే జనకాదిరాజర్షిసత్తము లీచంచలను తృణప్రాయగాఁ బరిగణింతురు ?

ద:— గురువర్యా ! సత్యము, సత్యము. తొంటిరాజన్య లస్థిరమైన యీరాజ్యరమ వీడి యచంచలమును సుఖదాయకమునగు విరాగముఁ బరిగ్రహించి వార్ధకంబునఁ గాననసీమ వానప్రస్థులై గడపనుంకించుట

క. వెలవెలఁదికంటె కడుచం
చల యీరాలచ్చి రామచంద్రునియంక
స్థలి గనిచి వనిని నద్యః
ఫలమై, సుఖద మగుసత్తపం బొనరింతుఁ.

ఇది నామనోనిశ్చయము. ఈవిషయమై మీయభిప్రాయముఁ దెలుపుఁడు.

వ:- రాజా ! ధర్మబద్ధం బగుమీమనోనిశ్చయ మెంతయు శ్లాఘ్యము. అట్లే యొనర్పఁదగు.

సు:— మహారాజుగారియోచన కడుసమంజసము.

సా:— నిర్వక్రపరాక్రముండును, క్షత్రియకులాభికముద బాంధవుం డును, జననయనచకోరచంద్రుం డగురామచంద్రసార్వభౌముని మీమాఱుగఁ గాంచఁగలము. పూర్వరాజానుసరణం బగుతేమ తపోవనగమన మెంతయు నుతిపాత్రము.

వౌ:— మహారాజా ! తమవాంఛ మాకెంతయుఁ బరమసమ్మతము.

ద:— గురూత్తమా ! సచివచంద్రమా ! నే ధన్యుఁడ.

శా. భూపాలుండు నచించుసత్పథము సంపూర్ణానురాగంబున
నేపట్టంగల సద్గురుండు, సచివశ్రేష్ఠుండు, సామంతులు
న్బాప్రైయు డ“శుభస్య శీఘ్ర”మని సంభావించి శ్రీరాముని
న్భూపాలు న్బనరించి స్వస్థముగ సమ్మోదంబున న్మించెదన్.
(వామాక్షిస్పందనము గమనించి)

వ:— (గమనించి) అమంగళము ప్రతిహత మగుఁగాక.

ద:— (అల్పకించతో) అయినఁ గానిండు. ‘ఆలస్యాదమృతం విషమ్’ ఎల్లి సుముహూర్తముననే శ్రీరామచంద్రపట్టాభిషేక మొన ర్పవలసినది. కాన సచివాగ్రణీ ! సర్వ మాయత్తము చేయింపుము.

సు:— ప్రభునాజ్ఞానుసారమే.

ద:— గురువరా ! నేటికి సభఁ జాలింతమా ?

వ:— సరియే. (యవనిక జారును)

2. స్థలకము — అయోధ్యాప్రాంతోపవనము.

(జానకీదేవీమాలతు లుందురు.)

మా:— దేవీ ! సార్వభౌమునిసతి వగునట్టి మమ్ము యధాప్రకారము ప్రేముడిఁజూతురా ?

జా:— చెలీ ! అప్పుడీజానకి వేఱొకజానకి యగునా ?

తే. గీ. కలిమి, యుచ్చస్థితియు భేదకారణ మగు
మానవునితత్వమందు సుమ్మా ! పౌలంతి !

కుజనుని మఱింతకుజనునిఁ గ్రూరుఁ జేయు
సజ్జనునిఁ జేయును మఱింతసాధువుగను.

మా:- తల్లీ! జానకీదేవి! మీగుణము మేలెఱుఁగమా? ఈయువ
వనసౌందర్య మీక్షింతము. వివిధవర్ణకుసుమలతాపరివేష్టితమైన
యీయెలమావిగున్నకుఁ గల్గుకిసలయంబుల నాహరించి మత్తెక్కిన
యీపికమిథునము పంచమస్వరమున నెల్లెలుఁగెత్తి కూయుచు
న్నదో యాలింపుము.

చ. సగము గ్రసించి లేఁజిగురు చంచువుచే నిజభర్తనోట నిం
పుగ నిడు మ స్వప్రమోదమున ముద్దులు ముచ్చట లాడుకొంచుఁ బ్రే
మగరిమ సర్వలోకముల మాటికి మాటికిఁ జాటురీతి నీ
ఖగమిథునంబు తోషమునఁ గర్ణరసాయనము న్బొనర్చెడిన్.

జా:- మాలతీ! ఆకామ్రానమందలి శుకవిలాసముఁ దిలకింపుము.

తే. గీ. రావము న్బట్టి వచ్చుమార్జాలముఁ గని
యాకసంబున కెగసి రయంబుతోడ
వేఱొకవృక్షమున వ్రాలి ప్రీతిఁ బిలిచి
చోటుఁ జూపెడి యామాయశుకముఁ గంటె.

మా:- దేవీ! మఱియొకవింతఁ గంటిరా?

తే. గీ. తనను విసిగించుశుకముపైఁ దలఁపుమాని
శుకరవంబునఁ బలికెడిశోభనాంగి
వీవని యెఱుంగకే దెస ల్వెదకికొనుచు
కదుభ్రమించుబిడాలముఁ గంటె? తల్లి!

జా:- మాలతీ! సత్యము. సత్యము. చాలభ్రమపడుచున్నది. పాపము
తెలివిలేనిజంతువు. ఆసరోవరసౌందర్య ముపలక్షింపుము.

ఉ. చల్లనిపిల్లవాయువులు సారసగంధయుతాంబుబిందువు
ల్జల్లనఁగొంచు స్వాగతము మించినప్రీతి నొసంగు మంచపిం
డల్లన వీచికానివహమందున జంటలు జంటలౌచు తా
రుల్లసమాడు చుయ్యాలల నూఁగుచునున్నవి చిత్రవైఖరిన్.

మా:— అగును; దేవీ! మన మీచంద్రకాంతవేదికపై కొంతసేపు విశ్రమించి యీయాప్యాయమానమగు సమీరసుఖం బనుభవింతము.

జా:— మాలతీ! ఆవైపు చూడుము.

తే. గీ. పద్మమకరందమును గ్రోలి పద్మశయ్య
మత్తుగాఁ దూఁగుచున్న భ్రమరమునకును
ఝుంకృతి స్పద్మముకుళంబుజాడఁ దెలుపు
తేఁటియిల్లా లదిగో కాంచితే లతాంగి!

ఆవచ్చునది మంజరికకదా? ఇంతయాలస్య మేలచేసినదో కనుఁగొనవలెను.

మా:— అగును దేవీ!

జా:— నూతనాంబరగృహీతహస్తయై వచ్చుచున్నదే?

మా:— ఆలస్యమున కదియే కారణము కాఁబోలు.

జా:— ఊరకొనుము సమీపించుచున్నది. (మంజరిక ప్రవేశించును)

మం:— దేవిగారి కభివాదనములు.

జా:— మంజరికా! మాకంటె చాలసత్వరము వచ్చితివే?

మం:— దేవిగారు క్షమింతురుగాక. అత్తగారు నాకీయంబరముఁ బసదనమొసంగినారు. అచ్చట కొంచె మాలస్యమైనది.

జా:— మంజరికా! ఆయంబరము నాకెల్లండునో చూడఁగోర్కె వొడముచున్నది.

మం:— దేవీ! ఏమిక్కోరిక యిది?

తే. గీ. చీనిచీనాంబరంబులు చెలువముననొఁ
గూర్చుచుండంగ నీనారగుడ్డఁ గట్ట
కోర్కెవొడముట యశుభంబుకొఱకె యనుచు
సందియముఁ బొందుచుండె నాడెంద మిపుడు.

జా:— పిచ్చిదానా! యిం దశుభ మేమున్నది?

ఆ. వె. సకలసౌఖ్య మొందుసార్వభౌముం డైన
వార్ధకంబునందు వనమునందు

నందుసమయమందు యోగ్య మీయ్యదికాదె ?
యశుభ మెట్టు లగును ? యతివమిన్న !

దాని నిటు తెమ్ము.

మం:— (సవినయముగా) దేవీ ! ఇదిగో. (వల్కలము నందిచ్చును.)

జా:— (వల్కలము గ్రహించి) మంజరికా ! ఆరామమందిరమున నున్న ముకురముఁ దెమ్ము.

మం:— (నిష్క్రమించి ముకురముతోఁ బ్రవేశించును) తల్లీ ! ఇదిగో.

జా:— ఇటు తెమ్ము, సౌరభయుక్తములౌ నవకుసుమములఁ గొన్నిటిఁ దెమ్ము. (మంజరిక నిష్క్రమించును.)

మాలతీ ! నీ విచటనే యుండుము. నే నిప్పుడ వచ్చెద.

(జానకి నిష్క్రమించును)

మా:— విచిత్రము.

ఉ. కూటికి లేక పేద లిల గుక్తయు, సొమ్మును లేమి భర్తల
న్నీటికిఁగూటికి న్సగముగఁ జిత్తము కోరిన వెల్లఁ గల్గి మా
బోటులు వేవవే ల్మనుచుబోటికి నింతటి పేదకోర్కెయా !
యేటికి సార్వభౌమసతి కీగతి వల్కలధారణేచ్ఛయుః ?

జా:— (వల్కలధారిణియై ప్రవేశించి) మాలతీ ! మంజరిక యింకను సుమములఁ గొనితేలేదా ? ఇది యెప్పటి కాలస్యముఁ జేయునదే కదా ?

మా:— దేవీ ! అగును. వచ్చుచునే యుండును. చూచెద.

జా:— మాలతీ ! మంజరిక వచ్చులోపుగా నాయాభరణంబుల సడలింపుము.

మా:— దేవీ ! అట్లేల ?

జా:— చెలీ ! కృత్రిమసౌందర్యమునకు నైసర్గిక సౌందర్యమునకు వ్యత్యాసముఁ జూడ నెంచితిని.

మా:— సరియే. ఆలాగే చేసెద. (భూషణములఁదీయును)

మం:— (ప్రవేశించి) దేవీ ! ఇవిగో నవకుసుమములు. స్వీకరింపుఁడు.

జా:— మంజరికా! దామములఁ గట్టుము.

మం:— దేవియాజ్ఞానుసారమే. (దామములఁ గట్టుచుండును)

తే. గీ. పాదపంబుల కెంగొమ్మ శోభ నిడునవలు
నెలవుల న్బాసి కుములయి నిండు వేడ్క
కనకమయభూషణంబులు కాల్చిలుచోట్ల
నీలతాతని మసుకుట నిండ గుల్కు.

మం:— దేవీ ! సర్వదామములు లాయత్తములైనవి. తాము ధరించుకొనుటయే కొరువ.

జా:— మాలతీ ! పుష్పదామములచే నలంకరింపుము.

మా:— (అటులే చేసి) తల్లీ ! ముకురముఁ దిలకింపుఁడు. (అద్దమందించును)

జా:— (చూచుకొనుచు) మాలతీ ! ప్రస్తుత మీనీలకబరిభూష లెట్లున్నవి?

మా:— ఆ. వె. మధురవాణి నీదుమధురిమ మెచ్చుటఁ
గలదొ యనుచు మధుపగణము మూఁగి
వెదకుచున్నరీతి విరిసరు లూప్పమల
భాతి మేనితీరపై వెలుంగు.

మం:— దేవీ ! ఆర్యపుత్రులు వచ్చుచున్నారే !

జా:— నిజముగనా ?

మం:— దేవిగారియెడల పరిహాసమా.

మా:— దేవీ ! ఆర్యపుత్రు లీవల్కలధారణము సేయింతురేమో ? ప్రస్తుతము వారిరాక నిరోధింతునా ?

జా:— చెలులారా ! ఆర్యపుత్రు లేమందురో చూతము రానిండు. (శ్రీరాముఁడు ప్రవేశించును) ఆర్యపుత్రున కభివాదములు. (మొక్కి లేచి) ఈచంద్రకాంతశిలాకుట్టిమ మార్యపుత్రులచే నలంకరింపఁబడుఁగాక.

శ్రీ:— (ఆసీనుఁడై) ఏమిది జానకీ!

సీ. హేమాంబట్టుచీరల నోర్వనినీమేన
నారచీరలఁ దాల్చినావు నేఁడు
రతనాలసొమ్ముల రాజిల్లుతనువుపై
వనసొమ్ములను దాల్చినావు నేఁడు
రత్నకంబళములఘర్షణఁ గందుచరణము
ల్వనసీమఁ దిరుగాడ వచ్చె నేఁడు
పంజరశుకములపలుకుల కులుకు నీ
కడవిపుల్గులకూఁత లమరె నేఁడు

తే. గీ. అచిరకాలంబులోన పట్టాభిషేక
సింహపీఠిని నీవిపై వెలఁగునీకు
వనవివాసదౌర్భాగ్యంబుతో వసనభూష
ణంబు లీరీతిగ మనోహరంబు లయ్యె ?

జా:— ఆర్యపుత్రా! వల యిన్ని విభ్రాంతు లయ్యెదరు ?

ఉ. మానితరాజ్యవైభవసమాజమున న్సుఖలీలఁ జెంది యా
పైని సుఖంబుపై విసుఁగుపడ్డమనంబున రాజ్యభారము
నిస్నానుల కప్పఁజెప్పి పరిశుద్ధమనంబున ముక్తసంగులై
కానల కేఁగువారలకుఁ గామితివేషము వేళ యున్నదే ?

శ్రీ:— దేవీ! నాయభిప్రాయము వనసంచారయోగ్యం బగువేష మిది కాదని కాదు. ప్రస్తుతానవసరమా నిట్టివేష మేల తాల్చితివనిగాని మఱేమియుఁ గాదు.

తే. గీ. అర్ధదేహంబ వగునీవ యాసఁజెందు
వేస మెన్నఁడేనియు నా కవిహిత మగునె ?
పార్వతీగళగతమగు ప్రవాళదామ
మభవునకుఁ గంఠహారమై యలరుఁగాదె ?

జా:— మాలతీ! వల్కలధారి యగునార్యపుత్రుని పోయగముఁ దిలకింపఁగోరునాకు సాయపడవేమి ?

మా:— దేవిగారియాజ్ఞానుసారమే. (నిష్క్రమించి యొక వల్కలముతోఁ ప్రవేశించును)

జా:— (సస్మితయై వల్కలముఁ దీసికొని) జానకీసర్వార్థము వల్కలధారి యగునుగాక.

శ్రీ:— (మందహాసముతో వల్కలము గ్రహించి) సత్వరమ సఫల మనోరథ నగుదువుగాక. (వల్కలముతో నిష్క్రమించి ధరించి ప్రవేశించును.)

జా:— ఆర్యపుత్రా ! పరమనంతోషము.

(అరుంధతి ప్రవేశించును)

శ్రీ:— గురుపత్నికి రాఘవుఁ డగురామచంద్రుఁడు సతీయుక్తుఁడై నమస్కరించుచున్నాఁడు. (జానకీరాములు నమస్కరించి లేతురు)

అ:— తే. గీ. సార్వభౌమదుకూలవస్త్రముల నేఁడి
తపసియోగ్యవసనములఁ దాల్చెఁడు
జామదగ్న్యనిదుష్టశిష్టాశ్రమమున
లోకకళ్యాణకరమై విలోక్య మగుత.

రా:-దం:- గురుపత్నీ ! మీవచనము లమోఘములుకదా ? అను గ్రహింపఁబడితిమి.

శ్రీ:— సతీతిరియ వాంఛితము సకలలోకకళ్యాణమేకదా !

అ:— నాయనా ! శ్రీరామా ! త్వరగా పోవుచు మిమ్మాశీర్వదించిపోవ వచ్చితిని. పోయి వచ్చెదను.

జా:-రా:- చిత్తము. (తిరిగి నమస్కరింతురు)

అ:— చిరంజీవ ! సుఖీభవ !

జా:— మాలతీ ! ఈయవ్వకు తోవఁజూపి యనుజ్ఞఁగొనిరమ్ము. మంజరికా ! మారాకకై యుపవనద్వారమున నిరీక్షించుచుండుము. (అరుంధతికి తోవఁజూపుచు మాలతియు, నుపవనద్వారమువైపు మంజరికయు నిష్క్రమింతురు) ఆర్యపుత్రా ! ఈయిందుశిలావేది

కపై కొంచెమువిశ్రమించి పిదప నంతిపురాభిముఖుల మయ్యెదము గాక.

శ్రీ:— అటులే కానిమ్ము.

జా:— నాథా ! మామగా రార్యపుత్రులను పట్టాభిషిక్తులఁజేయ నిం కను జాగుచేయుచున్నా రేల ?

శ్రీ:— దేవి ! నా కేటితత్వర ?

ఆ. వె. సార్వభౌమపదవి సంతోషకము సుఖ
దం బటంచు జనులు తలఁచుచుందు
మకుటధారణంబు మతిమంతుఁ డౌ జేని
కధికదుఃఖకారి యబ్జవదన !

జా:— ఆర్యపుత్రా ! వేను. రేపే యభిషేకసుముహూర్తమని చెలు లచేఁ గర్ణాకర్ణిగా వింటిని. నాయీప్రశ్న యావిషయ మెఱుంగఁ గోరియే.

శ్రీ:— జనకు లగుమహారాజుగారుకూడ నుదయమున నటులే నుడివిరి.

జా:— అయిన దాని కన్యథాత్వ మేముండును ?

శ్రీ:— ప్రియా ! అటుల కాదు.

తే. గీ. చెడుగునకు నెంతు విఘ్నము చెఱుపు లేదు
శ్రేయమున కెన్నొ విఘ్నము ల్చేరువగును
చేతిలోకబళము నోరుఁ జేరువఱకు
నిజము లే దీజగంబున నీరజాక్షి !

దేవీ ! ఆవైపు చూడుము.

చ. కడు పర నించి రెక్కలను గ్లనిపిల్లల సాఁక నోరెము
న్గడువడిఁ దెచ్చుపక్షులను కావని తాఁకెడి శ్యేన మద్దిరా !
పడతిరో ! దుష్టశిక్షణము భావ్యము కాదె ? ధనుస్సుఁదెమ్మి యా
చెడుగున కాకగంబయినశ్యేనము నాశర మాహరించెడిఁ.

జా:— నాథా ! ఆర్యపుత్రులకు శ్రమతీరకయే తీఱినది.

తే. గీ. ప్రాణములకంటె గోవులపైని ప్రేమ
మించి, నేను వీడకయె వెమ్మఁగను పోతు
పెంటియును శ్యేనమును దాకి మింటి కెగసి
పరచుచున్నవి కాంచు మో ప్రాణనాథ !

శ్రీ:— అగును. దేవీ! క్షత్రియసహాయ మనవసరమే. అపరదిక్కు పరికింపుము.

తే. గీ. కలువయిల్లాలిబాసలకై ప్రేమలు తెలుపఁగఁ
బద్మినీకాంతవదనంబు వాడఁబోవఁగ
ఖరకరుఁడు జరిగెడు పశ్చిమాద్రి
శిఖరభర్మకుంభచ్ఛవి శ్రీ వహించు.

చ. కదువడి లేఁగల స్తనుపఁగాఁ జనుచున్నవి గోగణంబు, చూ
ప్పుడఁ బవలెల్ల దున్ని వృషభంబులు నిల్లు మొగంబుఁ బెట్టె, పె
ల్లుడికినగాడ్పు ఉల్లపడి యూరటఁ గూర్పఁగఁ బోవఁగా కాంచు మా
పడమటికొండనెత్తమున భానుఁడు ప్రాకి యదృశ్యుఁడయ్యెడిన్.

తే. గీ. కాలకామినీసీమంతకూల పసుఁగ
నధికతమసంబు బ్రహ్మాండంబు నాక్రమించె
సిలివలిపంపుపై జేసిపూ లసంగ
తారకావళి యంబరస్థలి వెలింగె.

ఎల్లి యభిషేకసుదినము. కావున నేఁటిరాత్రి యుపవసించి భగవద్భక్తిపై నుండుము.

జా:— ఆర్యపుత్రులయాజ్ఞానుసారమే. (జవనిక పోవును)



శ్రీ

# రామప్రవాసము

## ద్వితీయాంకము.

### 1. స్థలకము — అయోధ్యాపురవీథి.

(మంథర ప్రవేశించును)

మంథ:— ఈపట్టణ మెంతశోభాయమానముగ నలంకరింపఁబడినది! ఈకర్పూరపుముగ్గు లేమి! ఈపచ్చతోరణము లేమి! ఈరంభాస్తంభము లేమి! ఈమంగళతూర్యారావము లేమి! ఈజ్వాలాతోరణము లేమి! ఈసంగీతమృదంగారావము లేమి! ఈయభినయశాస్త్రప్రవీణములగు నీకళావతీబృంద మేమి! ఎచ్చటఁజూచిన నన్నదానమేలు! ఆహాహా! ఈయయోధ్యానగరము నేఁడు భూతలస్వర్గమువలెఁబ్రకాశించుచున్నదే. ఎచటఁజూచినను శ్రీరామనామస్మరణతప్ప వేఱొండు వినరాకున్నది. దీనికి కారణ మేమి చెప్పుమా. (అటు నిటు చూచి) కౌసల్యాంతఃపురదాసి మంజరిక వచ్చుచున్నది. దానిఁ గనుఁగొనిన నేమేని తెలియునేమో పిలిచెద. మంజరికా! మంజరికా! ఏమి యంతవినిపించుకొనక త్వరగా పోవుచున్నావే? ఒకమాట. (ఆలించుట నటించి) ఏమనుచున్నావు? 'నీకేమి పనిలేక మసలుచున్నావు, నాకు సీతాదేవిగారియంతఃపురమునఁ బెక్కుపనులున్నవి; యిచట కాలయాపనముఁజేయ వీలు లేద'నుచున్నావా? ఆలసింపను లే. ఒక్కమాట. అడుగుఁదప్పితివా సీతాదేవిగారియాన.

(మంజరిక ప్రవేశించును)

మంజ:— ఏమే సోమరిపోతా! మంథరా! పనిపాట లేక యేటికే యిట్లు పిలిచెదవు? నీమొగమునకుఁదోడు సీతాదేవిగారియాజ్ఞ

పెట్టుట కూడనా ? ఏమి నీవుట్టిమునిఁగినటు లార్భాటములు చేయుచున్నావు ? చిన్నమ్మగారిదాసివనియా యింతపొట్టపొగరు ?

మంథ:— కాదే మంజరికా ! వేళాకోళమునకుఁగాదు. పనియుండియే పిలిచితి.

మం:— నిర్దరమొగమా ! ఆగొడవ యేదో యేడ్వరాదా ?

మంథ:— మంజరికా ! ఎంతకోపిష్ఠివే! ఏమ్పుటయో నవ్వుటయో కారణముఁ గనుఁగొనికదా ?

మంజ:— దీనికి కారణము నీవుట్టుటకా గిట్టుటకా ?

మంథ:- ఏమే మంజరికా ! చిత్తజల్లువలె నీమాటలముసురుచే నోరెత్త నియ్యకున్నావు ?

మంజ:— నీయేడుపేదో కానిమ్ము. నే నిలువ వీలులేదు.

మంథ:— ఈపట్టణశృంగార మెందులకో నీకైనఁ దెలియునా ?

మంజ:— ఓసిపాడుమొగమా ! ఈయూరిలో నీ కారణముఁదెలియని నీవంటివా రెంద ఉందురే ముందుచెప్పు.

మంథ:— చెప్పవే. ఎందు కేడిపించెదవు ?

మంజ:— (స్వగతము) నీకేడ్పు కాక నవ్వువచ్చునా ! (ప్రకాశముగా) రేపు మనశ్రీరాముని పట్టాభిషేకము కాదటే ?

మంథ:— (విభ్రాంతితో) నిజమేనా ! నిజమేనా !

మం:— అయితే యిందులోఁ గొంతయబద్ధముకూడనా !

మంథ:— అందులకా పురమునకీయలంకారము ? (స్వగతము) అయిన నీశుభవార్త మాకైకాదేవికిఁ జెప్పెదఁగాక.

మంజ:— పోవుచున్నాను. త్వరగాఁబోవలె. (నిష్క్రమించును.)

(శనిగ్రహము ప్రవేశించును)

శ:— దేవకార్య మగురామపట్టాభిషేకభంగ మొనరూర్ప సమకట్టెద.

సీ. జూదమాడెడిచోట్ల సురఁ ద్రావువసతుల
జీవహింస నతంబుఁ జేయునెడల

పడుపువృత్తి మెలంగుపణ్యాంగనలచెంత
కలహాశనులు కూడు నెలవులందు
కూటసాక్ష్యము లిచ్చుచోటుల జనముల
మోసం బొనర్చెడిమూలలందు
పతిమృతికైనఁ దప్పక యొప్పు నెఱజాణ
లు వసించు చుండెడిభవనములను

తే. గీ. సతము నాట్యంబుసల్పెడిసాహసుండ
దేవకార్యార్థము జగచ్ఛుభావహంబుఁ
గోరి యీమంథరనుఁ జొచ్చి కుతుకమునను
రామపట్టాభిషేక కార్యంబుఁ జెఱుతు.

ఈమంథర యిప్పటికి సహృదయఁగ నున్నది. అదృశ్యవిధం బున దీని నావహించెద. అటులఁ జేయుటలో నేమైననంతరాయము కల్గిన నట్టియంతరాయ కారకులఁగూడ నావహించి నాకత్తి కెదురు లేక సంచరించెద. (మంధర కెదురుగాఁబోని యదృశ్యుఁ డగును.)

మంధ:_ ఏమి నాయవివేకము! రామపట్టాభిషేకము నాకు శుభవార్తయా? ఏమిటీమందమతినైనకారణము నాకే తెలియకున్నది? కైకాదేవిపుట్టినింటినుండి యామె వెంబడి పంపఁబడిన యరణపుదాసి నైననాకు మాదేవిగారి సవతి యగుకౌసల్యాకుమారుని కభిషేకము గావుండ శుభవార్త యెట్లగును? మహారాజుగారిముద్దుల పెండ్లమగు కైకాదేవి కైన నీవార్త తెలియలేదే! ఆ తెలిసినది. ముసిపెద్దపుత్రిల్లాలు కనుక నే తనకొమరునికిఁ బట్టముఁగట్టుమని యడుగునేమోయని వెఱచి రా జీవార్త యామె కెఱిఁగింపకుండెనని తోఁచెడిని. ముగ్గురభార్య యగుకైక యుండ పట్టమహిషి ననుమహాగర్వమున నిక్కుచు నీల్గుచుండెడికౌసల్య కిది సంతోషముపై సంతోషము. మాదేవిగారికి దుఃఖము. నాకతిదుఃఖము. ఆగోల కిది యంతయుఁ దెలియదు. నేఁ జెప్పినను వినునో వినదో? నయమునను భయమునను చెప్పిచూచెదను. వినెనా సరియే. వినకుండిన నేను నీదాస్యముఁజేసినదాన నానిర్భాగ్య

రాలు కౌసల్యదాస్యముఁ జేయుదురు. అట్లుచేయక తప్పకవచ్చును. ఆముప్పు మూఁడులోననే నేను తనకొలువు వదలిపోయెదనని చెప్పి బెదరించి చూచెదను. అప్పటికిని వినకున్న నామెకర్మకు నేనా కర్తను? రేపే యభిషేకమఁట. ఇఁక నేమాత్ర మాలస్యముఁ జేయుటయుఁ బ్రమాదకరము. నే నిప్పుడే యీవార్త మాదేవి కెఱిఁగింప సత్వరము పోయెదను.

(నిష్క్రమించును)

2. స్థలకము — కైకాంతఃపురము.

(కైక యుచితాసనాసీనయై యుండును.)

కైక.— ఉరమునఁ బెనుసంకటి యగుచున్నది. కారణ మేమైయుండును? (కిటికీచెంతకేగి పురిలోనికిఁ జూచి తిరిగివచ్చి కూర్చుండి) కారణము దురూహ్యముగా నున్నది. ఏవులఁగింగుమనెట్టు మంగళతూర్యారావములే. శ్రవణపేయములగు ముఖవీణాద్యాదివాద్యవిశేషములే. దిక్కులఁ బ్రాఁకి పెటిలుచున్న వేలునాకాశబాణములే. శత్రుజనకర్ణజ్వరాయమానములగు పెద్దదిమ్మల మ్రోఁతలో. ఇట్టియుత్సవ కారణ మేమైయుండును చెపుమా. దాసి మంథర నాపనుపునఁ బురములోని కేఁగినది; యిప్పటికి వచ్చుచునే యుండును. అది వచ్చినఁగాని కారణము తెలియదు. (వినుట నటించి) ఎవరిదో కాలిచప్పుడగుచున్నది. (మంథర హడఁగుచు ప్రవేశించును)

మం:— దేవి! దేవి! ఇంకేమున్నది! స్థాణువువలె కూరుచున్నావేమి? ప్రతిక్రియ యోచింపవేమి?

కై:— ఏమిటే మంథరా! అంతకాఁగోలఁ బెట్టెదవు? నీకొంప యేమి కూలినదే?

మం:— నాకొంప యేమియుఁగూలలేదు. నాదనున దొకటి యుండినఁ గదా కూలుట? పూర్ణముగా కూలినది నీకొంపయే.

కై:— కూలినకొంప కేమిచేయఁగలవారము? అట్లైన దానికై దిగులుపడవలసినపనియే లేదు.

మం:— పూర్ణముగా కాకుండిన ముప్పాతిక పాలిన దనుకొనుము.
కై:— ఆవిశేష మేమో ముం దెఱింగింపుము. సాధ్యమగు నెడల ప్రతిక్రియ నాలోచింతము.
మం:— రేపే మన శ్రీరామునకుఁ బట్టాభిషేకమఁట.
కై:— అదియేనా పురమున నుత్సవకారణము ?
మం:— అగును.
కై:— అట్లయినఁ బరమ సంతోషము.

ఉత్సా. కన్నతల్లికంటె నన్ను గౌరవంబు పెంపుసే
యున్న నన్నెఱుంగు సత్కుమారశేఖరుండు, స
ర్వోన్నతుండు రాజుగాఁగ నుండెనంటి వెల్లి మా
పున్నెము లభించె; నిదిగొ పొందుము రత్నహారముల్.

(రత్నహారమునుఁ బారితోషికముగా నొసంగును)

మం:— (విభ్రాంతి నటించుచు హారము గ్రహింపక దూరముగఁ ద్రోయును)
కై:— "నావిష్ణుః పృథివీపతిః" అను న్యాయమున విష్ణుతుల్యుం డగు మా రామచంద్రుఁడు నిందిరాతుల్య యగు మా జానకియుఁ బట్టాభిషిక్తు లగుట రేపే కదా ?

సీ. నీలాంబుధరకమనీయవర్ణుం డయ్యుఁ
శాపపంకజశీతభాస్కరుండు
మానినీలోకసమ్మోహనమూర్తి యయ్యును
పరకామినీసహోదరయశుండు
వైరికాంతారదావదహనుం డయ్యును
శరణాగతారాతిజలధరుండు
భార్గవగర్వాపహవిభుం డయ్యును
వందితభూసురబృందయుతుఁడు
తే. గీ. సకలరాజన్యప్రముఖసంస్తూయమాన
యశుఁ డగుచును రాజర్షితుల్యాశయుండు

రామచంద్రుండు పృథ్వి నేలు రమణమింతేఁ
గనునదేకద కన్నులు కలఫలంబు ?
రేపుకదా నాకన్నులు ఫలము లగుట ?

తే. గీ. అవనిజాత యర్ధాంగి వామాంకమందు
దక్షిణాంకమున నయోధ్య తనరుచుండ
సింహపీఠంబునందు వసించు రామ
చంద్రు రేపట జగమెల్లఁ గందుగాక.

మం:— (స్వగతము) ఈదేవి చాలసహృదయ. దుఃఖింపవలసిన సమయ మునఁ బిచ్చిదానివలె పరమసంతోష మొందుచున్నది. ఈ మెనడ వడి నాప్రయత్నమును భంగముచేయదుకదా ? (ప్రకాశముగా) కైకాదేవీ! నీవర్ణనమంతయు ముగిసినదా? ఇంకేమైనను కలదా ?

కై:— మంథరా ! ఏమ ట్లనెదవు ? మా రామచంద్రునిగుణంబుల వర్ణింప సహస్రశిరస్కుఁ డగుశేషుండునుఁ జే యసమర్థుఁడను చుండ నలువఁ దలఁపనేల ? మానవమాత్రనగు నా దేటిలెక్క ? ఎన్ని దినము లిట్లు వర్ణించినను జాలవు.

మం:— లోకవృత్త మెఱుఁగనియమాయికురాలా ! సార్వభౌముఁ డగు రామచంద్రుఁడు పిన్ననాఁటిరామచంద్రుఁడుగా నుండునని యే తలంచుచున్నావా ?

కై:— ఆవంతయు భేదముండదనియే నానమ్మకము.

ఆ. వె. రాజ్య మబ్బనిమ్ము రహి నష్టసిద్ధులు
వలచి వచ్చినను రవంతయేని
తోణకఁ డతఁడు సుంత, దూఱకు మాతని
నిండుకుండ తొణక నేర్చునొక్కొ ?

మం:— వెఱ్ఱితల్లీ ! రాజ్యలక్ష్మిగ్రహ మొనర్పఁగలకార్యంబుల నేఁ జెప్పెద వినుము.

తే. గీ. తనకు రాజ్యంబు లభియించుదారి యున్నఁ
దల్లిఁ, దండ్రిని, నన్నను, తమ్మునేని

యాలినేలియు, సుతుఁడు జాలిమాలి
బలిమొసఁగి, రాజ్యభారంబుఁ బడయు నృపుఁడు.

కై:— మంథరా! సత్యమే. కాని యది యిప్పటున నన్వయానర్హము. రాజ్యము నిచ్చువాఁడు మహారాజు. గ్రహించువాఁడు జ్యేష్ఠ పుత్రుఁడు. కోరునది సర్వరాజ్యము. అడ్డువా రెవ్వరును లేరు. భయకారణ మావంతయు లేదు.

మం:— (స్వగతము) ఈమార్గ మనుకూలించునటుల లేదు. వేఱొక త్రోవఁ ద్రొక్కెదను. (ప్రకాశముగా) వెఱ్ఱిబాగులతల్లీ! నేఁ జెప్పునది సవిమర్శముగ నాలకింపుము. రాజనీతిజ్ఞులు ఋణశేష, రణశేష, శత్రుశేష వహ్నిశేష ముంచ నెంచరు. ఒకదాయ బ్రదికియుండునవఱకు రాజ్య మూర్జితమని సక్షత్రియుఁ డెంచఁడు. ఏకగర్భజనితు లగునన్నదమ్ములే రాజ్యముపట్ల కరుణవహింపక యొకరొకరు చంపుకొనుచుండ సవతితల్లిబిడ్డలా యొకరినొకరు కరుణతోఁ జూచుట? ఇది గగనకుసుమము. (శని ప్రవేశించును)

శ:— ఆహా! ఈమంథరతంత్రము రామవాత్సల్యపూర్ణ యగునీయ మను మార్పుఁజెందింపలేకున్నది.

తే. గీ. రామవాత్సల్య మనుసుధారసపరీత
హృదయమును రామవైషమ్య మెట్లుచొచ్చు?
ఖరకరునికిరణాళిఁబ్రకాశిత మగు
భవనమును తమఃఖండ మెబ్భంగిఁ దూరు?

ఇందు నాసాయముకూడ నత్యవసరమని తోఁచెడి. అయినఁ గొంతవడి యీమాటుననుండి పొంచి యవసరమగునెడల కైకాదేవి నావహించి రామవాత్సల్య మడఁగఁద్రొక్కి మంథరవలలోఁ బడవైచెదను. (చాటునకుఁ బోవును)

కై:— మంథరా! ఇట్టి వృథాలాపము లేల? రామునకు భరతున కావంతయు భేదములేదు. కావున నాకిట్టివి బోధింపక వెడలిపొమ్ము

(శని ప్రవేశించును)

శః—ఇఁక నే జోకుఁజేసి కార్యములేదు. మంథరను వెనులనడుపుదశ కూడ వచ్చినది. ఇఁక నే కైక నావహించెదను. (కైకవైపు నడచి యదృశ్యుఁడగును)

మం:— దేవీ! నీమాటఁ గాదననేల? రాముఁడు మీరు చెప్పినట్లు సహృదయుఁడగుట మంచిదే. అటులే కానిచో భరతాదిపుత్రుల గతియు, సుమిత్రాదేవిగతియు మీగతియు నేమగునో కొంచె మైన యోజించితిరా? సవతితల్లివగునీవే యాతనిగుణపక్షపాత మున నతనివైపిట్లు మాటాడుచుండ సర్వరాజ్యము రామానురాగ సురాపానమత్తమై యున్నదనుటలో నసత్య ముండదుకదా? అట్టి రాముఁ డేమియొనర్చినను గొర్రెదాటువలె లోకము వల్లెయని సమ్మతించునుకాని కిక్కురుమనుపును వుండదు. రాముఁ డొకవేళ పరమశాంతుఁ డంటివేని స్త్రీసహజమగు సవతిమచ్చరమునకు, క్రొత్తగా రాజమాతయగుట విజ్జపీఁగుకౌలస్యమాత్రము తప్పక మిమ్ములను నిరువురఁ గాలఁబెట్టి నేలరాయకమానదని నే ఘంటా పథముగ నొక్కివక్కాణింపఁగలను. ఏకార్యమునకుఁగాని కడం గుటకు ముందు చెడుగు నెంచియే మంచి నెంచవలయు. ఇపుడు మిన్నకుంటివేని గోటితో మీటుదానికి గొడ్డండ్లతోనే తీర్పవల సినయవసరము రావచ్చును.

కై:— (శనిగ్రస్తయై తలయూచుచు స్వగతము) రాముఁడు మంచి వాఁడేకాని కౌసల్యనుమాత్రము నమ్ముట కష్టముగ నున్నది. మంథర చెప్పినది కొంచెము యోజింపవలసియేయున్నది. ఇంక నేమిచెప్పునో విందము.

మం:— దేవీ! ఏమట్లు గ్రహగ్రస్తవలె తలయూచుచున్నావు? నే చెప్పునదేమియు మీకు నచ్చుటలేదా?

కై:— మంథరా! నీవనినట్లు నాకు గ్రహమ్మే యావేశించిన ట్లున్నది. నిజముగ రామపట్టాభిషేకానంతరము రాజమాత యనుగర్వాంధ

కారమున నాకౌసల్య యేమొనర్చునో యనిమాత్రము భయమగు
చున్నది.

మం:— (స్వగతము)ఆ. తల తిరిగి కబళము నోటిలోనికి వచ్చుచున్నది.
ఇదియే బాగుగ పురిఁబెట్టవలసిన సమయము.

తే. గీ. సవతిమచ్చర మనెడినిశాతపరశు
ధార రామానురాగ మన్భూరుహంబు
ఁజెదిపి యచ్చోట రామవైషమ్య మనెడి
మొలక నిడ దోహద మొనర్పఁ బూనుదాన.

(ప్రకాశముగా) నేఁజెప్పినట్టులఁ జేసితివేని సర్వము సునా
యాసముగ నెఱవేరును.

కై:— మంథరా! చెప్పుము పూతము.

మం:— అమ్మా! గోడలకు చెవులుండును. (సమీపించి) అతిరహ
స్యము. చెవిలోఁ జెప్పెదను.

కై:— (స్వగతము) అబ్బా! ఏమి యీదాసీలసామర్థ్యము!

తే. గీ. కలకలయటంచు నవ్వకొంపలను కూలఁ
ద్రోయఁగ, నసాధ్యమర్గము ల్దాయలకుఁ గ
రస్థ మొనరింప, రాజుల మ్రిగ్గఁజేయ
దాసియే యింగలపుఁబుల్ల తలఁచిచూడ.

అది యెంత చెప్పినను

తే. గీ. రామచంద్రునిపైఁ గల్గుప్రేమ యొకటి
సవతికౌసల్యపైని మాత్సర్య మొకటి
వెనుకకును ముందునకు లాగి వెతలఁబెట్ట
నకట! కర్తవ్యతామూఢ్య మంకురించె.

(సంతసమున ప్రకాశముగా) మంథరా! పథకముమాత్రము
బాగుగ కుదిరినది. ఆరెండింటిని తులయందుంచి తూచిన సవతి
మచ్చరమే గురుత్వముసూచించెడిని. కొమరుఁడు ప్రభువై రాజ్యంబు
శాసించుచుండ రాజమాతనని నడుమవచ్చిన గర్వముచే నిక్కెడు

కౌసల్యపదవిని నే నీపాడుకండ్ల జూడ నొల్లను. ఈమహాకార్యమున కించుకమార్గదర్శివై పుణ్యముఁ గట్టుకొంటివి. తదుపరి కర్తవ్యముఁ గూడ బోధింపుము.

మం:— తల్లీ! అది పరమసులభము. వినుము. (చెవిలోఁజెప్పి) ఇట్లు చేసితివేని నీవు రాజమాత వగుదువు. నేను దాసీలకు రాణి నగుదును. సర్వరాజభోగములు మనల నాశ్రయించును. ఇది మార్గము.

కై:— సరియే. ఆయత్నమునకుఁ గడంగుదముపద. (కైకయు మంథరయు నిష్క్రమింప శని ప్రవేశించును.)

శ:— ఇప్పటికి కొంతదనుక కృతార్థుఁడ.

తే. గీ. పట్టభంగపౌష్పపుమాలబంధ మొంతొ
తిరముగా వేసెఁ గొల్ల మంథర శ్రమించి
కైక యాదిసోపానముఁ గట్టెఁగడఁగె
వెనుక కరుగకయుండెడివిధ మొకర్తు.

(యవనిక జారును.)

### 3. స్థలకము — కైకాకోపగృహము.

ద్వారమున మంథర యుండును.

(దశరథుఁడు ప్రవేశించును)

ద:— (స్వగతము) కౌసల్యారామునిపట్టాభిషేకవిషయమై నాముద్దుల భార్య కైకకుఁ జెప్పవచ్చిన నామె యంతిపురమునఁ గానఁబడకుండెననియు నేటికో కోపగృహప్రవేశ మొనర్చినదనియు తెలియ వచ్చుటచే నేనే స్వయముగా నాదేవిని శుభముహూర్తమునకుఁ బిలిచికొనిపోవుతలఁపున వచ్చితిని. ఇదియే కైకాంతఃపురము. ద్వారమున మంథర యున్నది. దానివలన దేవివృత్తి తెలియఁగలను. (ప్రకాశముగా) మంథరా! మాదేవికి సత్వరము మారాక నెఱింగింపుము.

మం:— చిత్తము. మహాప్రభూ! (స్వగతము) ఈరాజు నిష్కపటియు స్త్రీలోలుఁడును. నేఁబన్నినవలలో మృగమువలె చిక్కినాఁడు. పైని నేఁ జెప్పినట్లు చేయునాయీనిన బెబ్బులివాతనుండి యెట్లును తప్పించుకొననేరఁడు. (నిష్క్రమించి తిరిగి ప్రవేశించి మహారాజా! దేవిగారంతిపురమున నెచ్చోటను గాన్పింపరైరి. కోప గృహముమాత్రము గొళ్ళెముగఁ బెట్టుబడియున్నది. అందుఁ జొచ్చుటకు నాకు గుండెలాగక తమకు మనవిఁజేసికొనవచ్చితిని.

ద:— (ముందునకు నడచి సాలోచనముగ నలుదెసలు పరికించి స్వగతము) ఈయుతిపకుఁ గోపకారణ మేముండును? (తల పంకించి) ఈశుభవార్త తన కెఱింగింపకుంటినని యుండునా? అదియు సమంజసమే. 'ముంజేతికంకణమునకు కద్ద మేటికి?' (ఒకవైపున చినిగినవస్త్రములతో భూషణవిహీనయైనకైకను దరిసి ప్రక్కనఁ గూర్చుండి) దేవి! ఏమిది? ఈయకాలకోప మేమి? నాకేమియు నర్థము గాకున్నదే?

సీ. నవరత్నమయభూషణంబులఁ జెలువొందు
తనులత త్యక్తభూషణ మిదేల?
పలుగుబంగారుచుచేలధారిణి యగు
తరుణి కీచించిపివస్త్రం బిదేల?
హంసతూలికశయ్యలందు మెలంగెడి
యతివ కీనేలశయ్య యిది యేల?
పూర్ణిమాశశి కసంపూర్తిఁజూపెడిముఖ
బింబాన విన్నదనం బిదేల?
తే. గీ. రామచంద్రాభిషేకకార్యంబువలని
సంతసంబున మూఁడవవంతుఁ గలుగు
గుణగణావు తోషసమయాన కుందుచున్న
కతముఁ దెలుపుమీ తీఱువసతి యొనర్తు.

కై:— (కోపమున) మహారాజా! చాలుచాలు. ఈదువ్వుల కేమి? ఈకైక యుండిననేమి మండిననేమి? ఈపెవిషయ మర్మములు

లోను బిండములలోను లేకుండఁజేసి యీపట్టణమందుఁగల ప్రతి హీనమానవునికిఁగూడ తెలియునటులఁజేసి నేనుమాత్ర మెఱుఁగకుండునేర్పాటుఁ గావించితివిగదా? ఏమి నీసామర్థ్యము? నీమంత్రరక్షణాచణత నాయెడల వెల్లడియొనర్చితివిగదా? ఇన్నిదినములనుండి నాయెడ బూటకపుప్రేమఁ జూపుచుండినఁ దెలిసికొననేరని తెలివితక్కువదాననని గదా యింతయుపేక్షాభావముఁ జూపితివి. సమరాంగణములలో బ్రాణముఁ దృణప్రాయముగ నొనర్చి నీకు సాయమొనరించినందులకు మిక్కిలికృతజ్ఞతఁ జూపితివి.

తే. గీ. నవ్వుల న్దుర్నవ్వులను పైని దువ్వినవ్వ
ప్రాణతుల్యంపుప్రేమఁ గన్పడ నటించుస్త్రీ
పురుషు లెన్నఁగ గోముఖపుండరీక
ములుఁ బయోముఖవిషకుంభములు ధరిత్రి.

ఈవిధ మిన్నిదినములనుండి యెఱుంగక బేలనైతి. ఇట్టిబేలలతో మహారాజుల కేమిపని?

తే. గీ. పట్టము గట్టఁగాఁ బ్రభుత్వంబుఁ దాల్ప
మీరు రాముండుఁ గల్గ నేమి యిఁక కొదువ?
వసువు, వరుఁ డుండఁ గాదె వైవాహికంబు
బంధువులు రాకయుండిన భంగమగునె?

కావున మీయిష్టానుసారమే కానిండు.

ద:— దేవీ! నేఁడుదయమున లేవఁగనే యెవ్వరిమొగముఁగాంచితినో కాని నీనోట నెన్నఁడు వినని కర్ణశూలాయమానము లగుమాటలు విని కుత్తుకబంటి నివ్వెరపాటుఁజెందియుంటిని. నామాట వినుము.

క. నానరస యుద్ధములలో
వేసరక సహాయమైతే విజయముఁ గంటిమి
నీసాటియె వా రిరువురు
కౌసల్య, సుమిత్ర, లేల కనలెదు నాపై ?

అందువలననేకదా పంచప్రాణములలో నొక్కర్తుగా నినుఁ

బరిగణించుచు తక్కు-సపత్నులకంటె నెక్కుడుప్రేముడిఁ జూతును? అట్టినాయంతరంగం బెఱుంగక యేమేమో మాటాడితివి. పొర పాటునకు క్షమింతు. ఈవృత్తాంత మింతదనుక నీకెఱిఁగింపనికార ణముకూడ నిదియె.

శా. నీకు న్నాకు నభేదమౌకతమున న్నీ రేజపత్రేక్షణా ! నాకోర్కెల్లది నీవిగాఁ దలఁచి యానందాబ్ధిలో ముస్గి నీ కీకళ్యాణసువార్తఁ జెల్పఁగను నేనే వచ్చితి న్నన్ను నీ సాకల్యాసమవాక్సుధారసమున న్సంతోషిఁ గావింపుమీ.

(శ్రీ)రామపట్టాభిషేకముహూర్తము దరియుచున్నది. సర్వాలం కారభూషితవై వైళమ రమ్ము పోవుదము.

కై:— మహారాజా ! మన కిరువుర కభేదప్రతిపత్తిఁ జెప్పితివిగదా ?

ద:— కామినీ ! కాకేమి ?

కై:- అటులయిన నీవిషయమునఁదప్ప యని యన్వయింపవలయును.

ద:- (విభ్రాంతుఁడై) ఏమి దేవీ ! ఈవిషయమున నన్వయింపదంటివి? ఎట్లన్వయింపదు ? జ్యేష్ఠుఁడును, అభిషేకార్హుఁడునగు శ్రీరా మాభిషేకవిషయముననే భేదాభిప్రాయమా ?

కై:- చెప్పుచుండఁగనే యేల త్వరఁజెందెదరు ?

ద:- కార్యము సత్వరము కావలసినదిగాన నంతత్వర.

కై:- కాఁగలకార్యము సత్వరమ యగును. శంబరాసురయుద్ధ మొక సారి స్మరింపుఁడు.

ద:- (స్మృతి నభినయించుచు) దేవీ ! స్మరించితిని.

చ. సమరముఖంబున న్రథపుచక్రము క్రుంగిన నేను వైరిభీ కరముగను పోరుచుండఁగ సమర్థతకల్మిని తేరుడిగ్గి చ క్రము ధరఁ గ్రుంగకుండఁగ భరంబునఁ దేరుబికించిపట్టి, వై రిమద మడంచుపూన్కిఁ దర్పింపఁగఁ జేసి జయంబు గూర్పవే ?

అర్ధాంగీ! అట్టిసాయము నేను మఱతునా? కావున నీకదా నీకప్పుడే వరద్వయ మొసఁగినది. అప్పుడే కోరుకొనుమనిన నవ సరమైనప్పుడు కోరుదునని నీవు చెప్పినట్లు జ్ఞాపకము.

కై:- (సంతసమున) నాథా! నిజము. సత్యనిత్యుఁడ వగునీవు వాగ్దానము విస్మరింతువా?

ద:- కాంతా! లేదు.

కై:- ఆవరము లిప్పు డనుగ్రహింపవలయును.

ద:- అవశ్యము. అటులే చేసెద.

కై:- మహారాజా! నే కోరుకొనవచ్చునుకదా?

ద:- తరుణీ! ఏల యట్లు గుచ్చిగుచ్చి యడిగెదవు?

చ. దవశిఖ చల్లనైన, హిమధామనగం బనలంబుఁ గ్రక్కినన్
శివుతలపుఖ్వ వేడిమినిఁ జెందిన, నంబుధు లెల్లఁబొంగి యీ
భువి దిగమ్రింగఁబోయినను పూర్వగిరి న్రవి యస్తమించినన్
రవికులుఁ డైనపార్థివుఁడు రాజముఖీ! యనృతంబుఁబల్కునే?

కై:- (స్వగతము) ఈయొత్తున నే యుక్కిరిబిక్కిరనకుండ కట్టివేయ వలయును (ప్రకాశముగా) మహారాజా! అవధరింపుఁడు.

ఆ. భరతు నేఁడ పట్టభద్రుఁ జేయుట యొండు
రాము నయ్యరణ్యసీమ నేల
పదియునాలుగేండ్లు పంపుట మఱియొండు
వరయుగం బొసంగు ధరణినాథ!

ద:- (చెవులుమూసికొని) కైకా! ఇవి నీమాటలేనా? పరిహాసము నకుఁ గాదుకదా? నే నమ్మఁజాల, నమ్మఁజాల. ఇది నిన్నావే శించిన యేదేనిపిశాచవాక్యములుకాని యివి నీవని నే ముమ్మాటికి నమ్మఁజాల.

క. భరతునికం టెను రాముని
కరుణారస మొలుకుదృష్టిఁ గాంచెడి నీ వీ

ధరణిని బలుకుదువని యే
కరణిని నమ్మఁగలవాఁడ కంజాతముఖీ !

నామనస్థైర్యముఁ బరీక్షించుచుంటివేమోయని తలఁచెదను. కావున నివి తప్ప వాంఛనీయవరద్వయం బడిగి నన్ను సుఖవార్ధిఁ దేల్పుము.

కై:- నాథా ! మీ రిచ్చెదమని మున్మాటికిఁ జెప్పిన వరంబులఁ గోరుకొంటినిగదా ? నా కివే వాంఛనీయములు. ఒసంగిన నొసంగుము. అటుల కాదేని నే జెప్పవలసిన దేమున్నది?

ఉ. ఆడినమాట మీఱఁగ భయంపడి రాజ్యము మౌనికిచ్చి మో
మోడక భార్య నేకసుతు నూడిగము న్బొనరింప నమ్మి తా
కాడున దాసుఁడయ్యె కులకాంత నిజప్రభునాజ్ఞఁ జూపగా
నోడని యా త్రిశంకజు కులోత్తము నప్పుడె విస్మరించితే ?

ద:- మామూలపురుషులలో నొకఁడై జగజ్జేగీయమానసత్యదీక్షాపరతంత్రుఁడును, మాకెల్ల మేలుబంతి యగుహరిశ్చంద్రచక్రవర్తినే మఱచునంతటియవమతినా ? అతివా ! మఱియొకతూరి యాలోచించి వేఱువరంబుల వేఁడుము. అగ్నిఁ జొరుమనినఁ బరమసంతోషమునఁ జొచ్చెద. సముద్రమున నుఱుకుమనిన నిస్సంశయముగ నుఱికెద. మహావిషోరగములతోఁ బోరుమనిన జడియక పోరెద. అశని కెదురేగుమనిన పరమాహ్లాదంబున నేగెదఁగాని లేక లేక యఱువదివేలవత్సరములపిదప కలిగినపుత్త్రులలో జ్యేష్ఠుఁడు, నగ్రగణ్యుఁడు, గుణభూషణుం డగుకౌసల్యారాముని యభిషేకమునకుమాత్రము విఘ్న మొనరింపకుము. (గడ్డముఁబట్టుకొని) బతిమాలెద.

కై:- మహారాజా ! చాలుచాలు. ఏల యిట్లు బేలవై పల్కెదవు ? నా కీవరములుదక్క వేఱేవియు నక్కఱలేదు. ఇచ్చిన నిండు. లేకుండిన మీదుష్కీర్తి కాలఫలకంబున స్థిరమైనశిలాక్షరములఁ బ్రకటింపఁబడియే యుండునని మున్మాటికి నమ్ముము.

ద:- ఓసిపుత్రద్రోహీ ! ఓసిభర్తృద్రోహీ ! ఎంతటి దృఢకలుషవే ! నిన్నేమిచేసినను పాపముండదుకదా ? నన్నీవలఁ బడఁద్రోసి లోలోన సంతసించుచుంటివా ? హా ! కౌసల్యారామా ! నీపట్టాభిషేక మీవిధమాయెనా ? దుర్భరము, దుర్భరము. నా యీ ప్రస్తుతస్థితి పగవారలకైనను వలదు.

క. శ్రీరాముని దినమణికుల
వారాశిశశాంకు సకలవైభవములతో
గారామున నభిషేకము
చే రాజిలఁ జేయఁదలఁచఁ జెడఁ గైకయె.

ఇది నాకర్మఫలము కాఁబోలు. హా రామా ! పట్టాభిషేక వాంఛ సతీయుక్తుఁడవై సకలభూషణభూషితుఁడవై, యస్మన్నయనచకోరచంద్రుఁడవై నాయాశీస్సుఁ బొందవచ్చు నీమొగ మీనిర్భాగ్యుఁడు సిగ్గేది యెట్లుచూడఁగలఁడు ? ఈపిట్టపిడుగు వార్త నీకేమని చెప్పఁగలఁడు ? హా విధీ ! ఈనాటక మిఁక నే నేమాత్రము నాడఁజాలను. ఈభూమికాధారణమున నే నపజయము నొందకతప్పదని నాయాత్మ గట్టిగ నొక్కి చెప్పుచున్నది. హా రామా ! నిర్జితసోమా! సుగుణధామా! సకలరాక్షసవిరామా! మునిగణవినుతనామా ! కౌసల్యారామా ! అభిషేకంబుచే సన్మానింపఁదగు నీకీకాననరాజ్యాభిషేక మెవ్విధి విధింతు ? కైకా ! రాముఁడు సర్వజనమనోభిరాముఁడే, అనవరతగురుజనవిధేయుఁడే, సర్వసముఁడే, యట్టివానియెడల నీకింతనిష్కరుణ యేల కలిగె ? నాయందలి యనురాగంబునను, శ్రీరామునియెడ వాత్సల్యముననైన నీవరములుతప్ప వేఱువరములు వేఁడుము. పరమసంతోషమున నిత్తును. జాగుఁజేయకుము. పాదము లంటి మ్రొక్కెద. (పాదము లంటఁబోవ కైక తొలఁగును) జ్యేష్ఠుఁడు శ్రీరాముఁ డుండ, భరతుఁ డెన్నఁడును ప్రభువు కాఁజాలఁడు. నీ బోటిముక్కడిగర్భమున జనించినకతన వానిచేతిలోఁ దకయులు సైత మే నొల్ల. శ్రీరాముఁడు కానఁ జేర నా కేదే కాన కాదా ?

కైక:- రాజా! ఈబుడిబుడియేడ్పులవలన కార్యమేమి? భరతుఁడే యయోధ్యాపతి కావలయు, శ్రీరాముఁడే వనాధిపతి కావలయును. నామత మిది యిఁక తిరుగదు.

దశ:- అక్కటకటా! పాషాణహృదయా! లోహాంతరంగా! వజ్రకఠిన స్వాంతా! నరలోకరాక్షసీ! చాలదు. ని న్నేమనిసంబోధింపవలయునో యాశబ్దము వాఙ్మయమున నెచ్చటను గనుపట్టదు.

తే. గీ. కఠినవజ్రంబును ద్రవింపఁగా నొనర్చు
నామదుఃఖతాపంబులు నాతి! నీదు
లోహకాఠిన్యహృదయంబు దోహదంబు
జేయలేవయ్యె. మాహాత్మ్యంబుఁ జెందియుంట.

ఓదండధరా! పుట్టినదాది లెక్క కొక్కఁడేని యవజ్ఞ సలుపని యగ్రపుత్రుని రాజ్యార్హుని స్త్రీలోలుఁడై, సత్యవాగ్బంధమునఁ జిక్కి యన్యాయముగ నసమయమున కానలపా లొనరింపఁబోవు నీయన్యాయధరణీపాలుని నీదండహతి మ్రగ్గఁజేసి నీపురి కతిథి నొనరించుకొన జాగొనర్చెదవేల? ఓ భూమ్యాకాశాదులారా! సర్వసమర్థుల రగుమీ రొక్కసారి యుప్పళించి నను నలిపివేయరాదా? ఓసర్వభక్షకా! న న్నొకనిముసమున భక్షింపరాదా? ఓయంబుధులారా! మీ బాడబానలంబున నన్ను ముంచరాదా? మా కౌసల్యారాముని నే నేమొగంబునఁ జూతు? హా కైకా! ఎంతఁ జేసితివే?

తే. గీ. అమృతవల్లివటంచు మూర్ధమునఁ దాల్ప
గరళవల్లివై ప్రాణము లురుగఁజేతే?
రవికుల మొనర్చినట్టి ప్రారబ్ధ మేమొ
నిన్నుఁబోలు నార్యేతర యున్నకతన?

చూడఁజాల చూడఁజాల నీరాక్షసిమొగమును. హా రామా! అట్టికర్ణకఠోరవాక్యము నీకుఁ దెలుపుటకంటె మరణమే పరమసుఖ

దాయకముకదా! మాకౌసల్యారాము నొకసారి పిలిపింపుము.
(మూర్ఛిల్లును)

కై:- రాముని( బిలువ సుమంత్రు నిప్పటికే పంపితిఁగదా?

మం:- దేవీ! శ్రీరామచంద్రుఁడు సుమంత్రునిచేఁ బిలువఁబడి కాఁ
బోలును వచ్చుచున్నాఁడు లక్ష్మణుఁడు వెన్నంటియే వచ్చు
చున్నాఁడు. ప్రవేశపెట్టుదునా?

కై:- (యోజించుచు) ప్రవేశపెట్టుము. (మంధర నిష్క్రమించును.
శ్రీరాముఁడు ప్రవేశించును.)

శ్రీ:- (కైకకు ప్రదక్షిణనమస్కారములు చేసి) తల్లీ! ఏటికి మా
జనకు లిట్లు మూర్ఛాగతులైరి?

తే. గీ. వృద్ధుఁడౌ మహారాజు నీవిధ మొనర్చు
కారణము మాయవినయమో కరుణచేసి
సత్వరమ తెల్పి నామనశ్శాంతిఁ గూర్పఁ
గేలు మోడ్చుచునున్నాఁడ బాలకుఁడను. (తిరిగి మ్రొక్కును.)

కై:- శ్రీరామా! విశేషకారణ మేమియు లేదు. తొల్లి శంబరాసుర
యుద్ధమున సాయమొనర్చినందులకు నాకు మీతండ్రిగారు వర
ద్వయ మొసంగిరి. దానికై భరతున కభిషేక మొనరించుమను
టొకటియు నిన్ను పదునాల్గేం డ్లరణ్యవాస మొనరింపఁబంపుట
రెండవవరముగఁ గోరితిని. సత్యనిరతుఁడగుమహారాజుగా రీవార్త
నీ కెఱింగింప వెఱచి మూర్ఛితుఁడయ్యెను. ఇదియే కారణము.

శ్రీ:- (స్వగతము) ఇప్పటికి నే ధన్యుఁడ.

తే. గీ. శైశవంబాది యేయపచారమేనిఁ
జేయనట్టిఁడ నాయెడ నేయపకృతి
పొసఁగి జనకు దుఃఖాంబుధి ముంచెనో య
టంచుఁ దలఁచునా కూరట కొంచె మబ్బె.

(ప్రకాశముగా) తల్లీ! ఇట్టి స్వల్పకార్యంబునకై వృద్ధుల
మనముఁ గలఁతఁబెట్టవలసివచ్చెనా? ఈకోర్కె నీవుగాని, జనకుఁడు

కాని, నా కావంత యోజింగించియుండినఁ బరమసంతసమున 'వల్లె' యనకుండి యుండునా? ఇట్లేల చేసితి వమ్మా!

చ. జనకునియాజ్ఞయైనయెడ సాగరమం దుఱుకంగ జంక న
య్యనలమున న్జొర న్వెఱువ, నయ్యశని న్గరమందుఁ దాల్పఁగాఁ
దొనకను వ్యాఘ్రసింహములతో నయిన న్బెనఁగంగఁబోదుఁ, గా
ననసుఖజీవనంబున ననాదరణం బొనరించువెట్టినా?

(తెరలో)

మ. సుగుణాకారుని, రామచంద్రవిభు, సంస్తుత్యప్రభావాఢ్యు, శౌ
ర్యగుణోపేతునిఁ బట్టభద్రునిఁ నొనర్ప న్విఘ్నము న్జేయఁగాఁ
దెగువన్బూనినవార లీక్షణము యార్తిన్బొందఁ దచ్ఛీర్షము
ల్దెగిపోనేసి గురుప్రహర్ష మనుసంధింతు న్మహోకాంక్షచేఁ.

( మహాగ్రహుఁడై లక్ష్మణుఁడు విచ్చుకత్తితో ప్రవేశించి పై పద్యముఁ జదువును.)

శ్రీ:- (ఇంచుక కోపితుఁడై) లక్ష్మణా! ఇచ్చట నీప్రసక్తి యేమియు లేదు. మేఱమీఱకుము.

ఉ. న్యాయముచేత నేను జననాయకదత్తవరానురూపమై
త్రోయ నసాధ్యమౌట భరతుండె ప్రభుండగు నెచ్చటైనను
న్యాయదు నిన్ను సేవ యసిఁ బట్టఁగనేటికిఁ గోపమేల? పో
చేయుము సేవ యాభరతుచెంగట, దుందుడు కింత చెల్లునే?

ల:- ( ఖిన్నుఁడై నాల్గడుగులు నడచి మఱలి కత్తి నొఱయందుంచి శ్రీరామునకు సాష్టాంగదండప్రణామ మొనరించి పాదములంటి మోకరించి )

తే. గీ. పట్టభంగవృత్తాంతము పగులఁ జేసె
గుండె యొడలెఱుంగక వచ్చి కోపమునను
కత్తిదూసి పల్కితి నేను కావు, కావు
భ్రాతృవత్సలా! ద్రోహిని పాపి నన్ను.

ద:- (ఇంచుక తెలివిఁగని) కూర్మితనయా! లక్ష్మణా! ఖడ్గము నోఱయం దుంచకుము.

తే. గీ. పట్టాభిషిక్తుఁ జేసి నీ మనవి నిల్పఁ గనుచు కైకేచ్ఛఁ దీర్ప
రామచంద్రు నుగ్రాటవి సేరు దంప
నొప్పు తప్పక యీతల నుత్తరించి
గిరగిరను రాముపాదము ల్దరియ వైచి
తన్మకుటమును రాముమూర్ధమునఁ బెట్టి
నీఋణము తీఱు నన్ను మన్నించుటగును.

రమ్ము. నాయనా! రమ్ము. దేనికైనను నీవే సమర్థుఁడవు.

శ్రీ:- లక్ష్మణా! గురునమస్కృతి యొనర్చి తత్పూర్వణ వేఁడుకొనుము.

ల:- అగ్రజు నాజ్ఞానుసారమే. (కన్నీటితోఁ దండ్రికి సాష్టాంగదండ ప్రణామ మొనరించి)

తే. గీ. అన్న పట్టాభిషేకంబు సున్నయన్నఁ
గోపమునఁ గాలులను కొన్నిఁ గూసినాఁడ
మత్తిలినపూర్ణకోధాయమానచిత్తుఁ
డను శరణమంటిఁ బ్రోవఁగాఁజనును మీరు.

ద:- నాయనా! లక్ష్మణా! ఇందు నీతప్పేమున్నది?

తే. గీ. తండ్రికంటె నగ్రజునిపైఁ దనరుప్రేమ
మించ రాజభక్తిని వెల్లడించి తీవు
నాకుమారుగా రాము సంతతముఁగొలువు
మస్మదాశీస్సు నినుఁ బ్రోచు ననవరతము.

శ్రీ:- లక్ష్మణా! నీవే కృతార్థుఁడవు.

ల:- ధన్యోస్మి.

శ్రీ:- అనుజా! కరుణార్ద్రహృదయ యగుతల్లిని దూషించితివికదా? ఆసదయహృదయ నా కొనరించినమేళ్ళఁ గంటివా?

సీ. రాజ్యనిర్వహణభారంబు భారంబు నీ
కేటికి సౌఖ్యేచ్ఛ నేగుమనియె
పెక్కురఁ బోషింప నెక్కుడు కష్టమా
నొకఁడవే సుఖమున నుండుమనియె
కుటిలదుర్మార్గసంకులముసూ రాజ్యంబు
వని నొంటరిగ నాత్మఁ గనఁజనుమనె
శాంతియుతులకు రాజ్యము నారకంబగు
ననువగు నీకుఁ గాననమె యనియె

గీ. సవతిబిడ్డనైన సద్హృదయంబున
భార మూనకుండ పరమకృపను
ప్రోచి సొంతసుతునిమూపున భారము
వైచికొనిన సుస్వభావచరిత.

తల్లీ! నీయీకార్యమున కెంతయుఁ గృతజ్ఞుఁడ. నేను సర్వ సంసిద్ధుఁడ. ఈశుభోదంతము మాతల్లికిని మీకోడలి కెఱింగించి వీడ్కొనివచ్చెద.

దః- రామా! సర్వగుణధామా! నాయనా! పోవుచున్నావా?

శ్రీ:- జనకా! తిరిగి తమదర్శనముఁ జేసియే పోయెద. ఇప్పటికి వత్తును. ఆజ్ఞ.

దః- తండ్రీ! కానిమ్ము. (శ్రీరాముఁడు లక్ష్మణయుక్తుఁడై నిష్క్రమించును) హా! రఘుకులదీపకా!

గీ. అరుల కెక్కుడై స్త్రీలోల మైననాదు
గర్భమున నిట్టిశాంతవిగ్రహము పొడమె
కనకకశ్యపగర్భసాగరమునందు
తొల్లి ప్రహ్లాదశశి యుద్భవిల్లినటుల.

అమంగళము శాంతించుఁగాక. ఈయుపమయు నాప్రాణాంత మునే సూచించుచున్నది. హా రామా! నిన్ను వదలి యొకనిముస మైన నీతనువు నిలుచునా? (మూర్ఛిల్లును)

కై :- ఆహాహా ! ఏమి యీరామచంద్రునిశాంతగుణము. ఉపమింప నశక్యము.

గీ. శిరముపై నెత్తిపట్టిన శీర్షకంబుఁ
దీసివైచిన నన్ను నెంతేని పొగడి
తండ్రిమాటకై వనికి వేఁదఱలుమహితు
శాంతి నా కెంతయేని లజ్జాకరంబు.

కార్యాతురులు కామాతురులవలె భయలజ్జావిహీనులుకదా ? మనము వేగిరించుచున్నది. శ్రీరాముఁడు కాంతారమార్గంబుఁ బట్టువఱకు నిరీక్షపట్టును. (యవనిక జారును)

## 4. స్థలము — కైకాంతఃపురము.

(శ్రీరాముఁడు ప్రవేశించును.)

శ్రీ:- ఆహా ! ఏమి విధిసంకల్పము ! దురూహ్యము. దుర్గ్రాహ్యము. తనకొమరుండ నగునేను పట్టభద్రుఁడ నగుదునని పుట్టెఁడాసతో భగవంతు నారాధించుచుండిననాతల్లి నీవార్త యెంత మార్పు నొందించెను ?

గీ. దశరథాంబుద మభిషేకధారఁ గురియ
సంతసింపంగ నెంచుకౌసల్యచాత
కంబు పట్టభంగాశనిక్షతిని సోలి
నేను సేదఁదేర్పఁగఁ గొంత మానె వగపు.

ధర్మమా ! నీవు సర్వశక్తియుతవుకదా ?

చ. అనుపతతోషయుక్తిఁ బ్రియుఁడైనకుమారుని రాజుఁజేయఁగా
మనమున నెంచుసత్ప్రభుని మాట వచింపఁగ లేనివానిగాఁ
దనయునిపైనఁ బ్రేమగలతల్లిని పుత్రుని కానకంప నొ
ప్పునటులఁ జేసివైచితిగ ? పూర్ణనిరంకుశశక్తి ! ధర్మమా !

మాతల్లి మొదటఁ బామరత్వమునఁ గొంచెము పట్టుఁబట్టినను జనకాజ్ఞ యనుచెలియలికట్టను మీఱఁజాలక యాపుత్రప్రేమాంబుధి వెనుక కరుగుట నే నీయొద్దఁ జేరఁగలిగితిని. అది యట్లుండ నింతకుముం దెన్నిపర్యాయములో భార్యాభర్తలు వస్తుఛాయాధర్మమున నవిభాజ్యులరని నుడివిననేనే కాంతారవాసకష్టంబులెన్నిబోధించినను సహధర్మచారిణి యగుమాజానకి నన్నను సరించుప్రయత్నముమాత్రము మానినది కాదు. నే నెంతదూరము చెప్పినను కడ కిట్లు లనెఁగదా ?

గీ. వీర్యశుల్కంబుగా నన్ను విలిచినట్టి
వాఁడ వర్ధాంగి నను వీడి వనికిఁబోవఁ
బురుషవేషంబుఁదాల్చినపొలతి యల్లుఁ
డయ్యె నని నాదుతండ్రి ని న్నట్టె నవ్వు.

ఆమెయుక్తివాదమును, సహధర్మచారిణీధర్మమును నన్ను మాటాడనివ్వనందున నొప్పవలసివచ్చినంతనే మాయావద్భూషణశయనాసనాదివస్తువాహనముల విప్రతతికి, నాశ్రితజనులకు వరుసగఁ బంచిపెట్టి సిద్ధముగ నుండుమని చెప్పివచ్చితిని. (ఆలించుట నభినయించి) ఎవ రావచ్చునది ? (వెనుకకు చూచి) మాలక్ష్మణుఁడే జానకిని వెంబడించి దీనాననుఁడై వచ్చుచున్నాఁడే ? ఆతని నూరడించెద. (జానకి ప్రవేశించును) దేవీ ! రమ్ము. తలిదండ్రుల యానతి వడసిపోవుదము. (లక్ష్మణుఁడు ప్రవేశించును.)

ల:- (స్వగతము) మాజనని జానకి వెంటవచ్చుటకే యంతయడ్డుఁ జెప్పిన యగ్రజుఁడు నారాక కియ్యకొనునా ? అయినఁ బ్రయత్నించెదఁగాక. (శ్రీరామునకు మ్రొక్కి లేచి) అన్నా ! పుట్టినదాది యొక్కనాఁ డెడఁబెసిఁగి యింతదనుక కాలముగడపిన నన్నుఁగూడ మీసపర్యఁ జేయ ననుగ్రహింపరా ?

శ్రీ:- తమ్ముఁడా ! లక్ష్మణా ! నే కాన కేగితిననువగపుచే సుక్కుమాతల్లిని వృద్ధుఁడగుతండ్రిని నీకంటె నెక్కుడుప్రేమతో నను

గాంచు సుమిత్రాజనని నోదార్చువా రెవరు? నాయనా! నా మాట విని గురుసేవ నొనర్ప నీ వయోధ్య నిలువుము.

ల:- అన్నా!

ఆ. తండ్రి వీవ నాకుఁ దల్లి యాజానకీ
దేవి గాని యొండు భావ మెఱుఁగ
నట్టితల్లిదండ్రు లడవులఁ దిరుగాడ
రామహీన మైనసీమ నేల?

లక్ష్మణునకుఁ ద్రిలోకాధిపత్యమైనను రామసేవవంటిది కాదు కదా? మఱియొకటి.

గీ. పట్టణంబం దనేకులు బంట్లు గొలువ
నీదుపదసేవ చిక్కదుగ లేదు నాకు
వనిని నీ వుండు పదునాల్గువర్షములును
తనివితీఱ నేకాంతసేవన మొనర్తు.

తదనుకూలముగ

ఉ. గంపను గడ్డపారఁగొని కంటకసంయుతకాననంబు పె
ల్లింపుఘటించురీతి నొనరించెదఁ గార్ముకము స్వరాళిచే
గుంపులు గుంపులై చెలగుక్రూరమృగాళి వధించి సౌఖ్యము
నొంపుగఁగూర్తు మీ కచట సోదర! యొప్పవె నాదురాకకున్.

ఉ. పూని ధనుస్సు నేను మునుముందుగ నేగుచుఁ ద్రోవఁ దీయఁగా
జానకిఁగూడి పర్వతపుసానువులందు మెలంగవచ్చుఁ బూ
పానుపుపైన సుప్తిఁ గొనుపట్టున మీరలు, జాగరూకత
న్నాని సతంబు కష్టములఁబొందెదివిమ్ము సుఖాబ్ధిఁ దేల్చెదన్.

నాయందు దనుగ్రహముకల్గి నారాక కనుజ్ఞ నిమ్ము. బ్రదికి నన్నాళ్ళు నాకుమారుగ శ్రీరామునిఁజూడుమని యాశీర్వదించిన జనకునివాక్యము విస్మరింపకుఁడు.

శ్రీ:- తమ్ముఁడా! లక్ష్మణా! జననీజనకుల కుపచరింపనుండుమంటిని గాని నీనిశ్చయ మట్లున్న ననుసరింతువుగాక.

ల:- అన్నా! అనుగ్రహింపఁబడుటచే ధన్యుఁడ. ఇంతకంటెను నాకుఁ గావలసిన దేమున్నది?

గీ. అష్టసిద్ధుల, యజ్ఞయాగాదికముల,
జపతపంబుల, సిద్ధుల నృపతివరుల
మునుల కందనిపురుషోత్తముని పదాబ్జ
సేవ దొరకుట ముక్తిగన్నోవఁ గంటి.

శ్రీ:- ఇదియే కైకాంతఃపురము. తండ్రిగా రిప్పుడే మూర్ఛనుండి తేటి నట్లున్నారు. జననికూడ శయనముననే కూర్చొనియున్నది. (తెర లేవ దశరథుఁడు కూరుచుండియుండును. కైక ప్రక్కన శయన మున నుండును. తండ్రిని సమీపించును.)

ద:- హా పుత్రా! రామచంద్రా! (అని ముందునకు సాగిపడి మూర్ఛిల్ల రామలక్ష్మణు లెత్తి శయనమునఁ గూర్చుండఁ బెట్టి సేదఁదీర్పఁగా స్మృతివచ్చి) శ్రీరామా! సత్యపరాక్రమా! సంసిద్ధుఁడవై పత్నీసోదరసంయుతంబుగ వచ్చితివా? నాకండ్లు కాలిపోను. తండ్రీ! వంశోద్ధారకా!

చ. కలుగఁగనేల నూరుగురు కట్టడుతాసుతు లక్కటక్కటా!
యిల నినుఁబోలువాఁడొకఁడయేని సుపుత్రుఁడు చాలఁడొక్కొ? భూ
తలముఁ దృణంబుగాఁదలఁచి ధర్మగురుత్వము చేతఁ గానన
స్థలిని వసింపఁబోవుచు విషాదమహాంబుధి ముంతువే ననుఁ.

గీ. ఆత్మ వోయినయట్టిదేహంబుసరణి
రామ నీ వేగ నేగతి ప్రాణ ముండు?
నీమసనమున మృతిఁజెంద నేల? నీదు
వెంట చనుదెంచువాఁడ నావిపినమునకె.

సుమంత్రా! (సుమంత్రుఁడు ప్రవేశించును)

సు:- దేవా ఏమి! సెలవు?

ద:- దేవీయుక్తముగ శ్రీరాము దర్శింపనెంతు. కావున కౌసల్యా సుమిత్రలను తత్క్షణము పిలిచికొనిరమ్ము.

సు:- చిత్తము (నిష్క్రమించి యిరువురితోఁ బ్రవేశించును)

కౌ, సు:-ప్రాణనాథా! నమస్కారములు.(మ్రొక్కి నిలువఁబడుదురు)

శ్రీ:- జననీజనకులారా! శ్రీరాముఁడు సతీసోదరయుక్తముగ మ్రొక్కుచున్నాఁడు. ధర్మసత్యరక్షణార్థమై వని కేగ సంసిద్ధుఁడనైన నాకు వల్కలముల నొసంగి వేగిరమ పయనమొనర్పుఁడు.

ద.కౌ. సు:- దీర్ఘాయుష్మాన్ భవ.

కై:- (నిష్క్రమించి వల్కలములతోఁ బ్రవేశించి) రామా ! ఇదిగో నీయాకాంక్షితవల్కలము. కైకొనుము.

శ్రీ:- తల్లీ ! మహాప్రసాదము. (వల్కలధారణ మొనర్చును)

కై:- లక్ష్మణా ! ఇదిగో నీకును వల్కలము.

ల:- (కోపము గదురఁ జూచి శాంతించి) ఛీ ! కోపమా ! నాదరిఁ జేరకుము. వేఱొకవసతిఁ జూచుకొనుము.

గీ. సార్వభౌముండు కాఁదగుజానకీమ
నోహరుఁడె వల్కలంబు మేనున ధరింప
నేను తద్దాసుఁడను తాల్పఁబూను టెంత ?
ప్రభు ననుసరించువాఁడెకా బంటు ? తలఁప ?

కై:- జానకీ ! ఈవల్కలము నీవు ధరింపుము.

జా:- చిత్తము(తీసికొని కట్టుకొన చేతగాక యిటునటు చుట్టుకొనుచు సిగ్గు నభినయించును)

శ్రీ:- ప్రియా ! పరిచారిక కావలయునా ? వనవాసులకుఁ బరిచారిక లెట్లువత్తురు ? నే నుంటిఁగదా ?

శ్రీ:- (వల్కలము ధరింపఁజేయుచు.)

కౌ:- గీ. ఊడిగముఁజేయ బానిస లుండ నీవె
ముగుదయిల్లాలిపుట్టంబు ముడువవలసె
కాననావాస మిడెడిస్వకార్యనిర్వ
హణమె మాకట్టిదుటనె కన్గొనఁగ వలసె.

(వశిష్ఠుఁడు పటాక్షేపముతోఁ బ్రవేశించును.)

వ:- కైకాదేవీ ? ఎంతకఠినహృదయవు ?

క. వరమని కోరుట రాముని
గురుతరకాంతారసీమకు న్బంపుట చే
కురె జానకి వల్కలములఁ
ధరియింపు మనుటయు వరవిధానమె ? చెపుమా.

ద:- పరమసుశీలా ! జానకీ ! ఆనార నావలఁ బారవేయుము. సుమంత్రా ! పదునాల్గుసంవత్సరములకు సరిపోవునువ్వాలువలు భూషణంబులఁ దెప్పింపుము.

సు:- ప్రభునాజ్ఞానుసారమే. (నిష్క్రమించి పైపరికరములతోఁ బ్రవేశించి) దేవా ! ఇవిగో.

ద:- తల్లీ ! అనుకూలభూషణంబుల ధరింపుము.

జా:- మామగారూ! చిత్తము. (నిష్క్రమించి ధరించి ప్రవేశించును)

వ:- కైకాదేవీ ! కల్లలెఱుఁగని యీనృపుని సత్యవాగ్బంధనమునఁ జిక్కించి కీర్తిన్మకీర్తి నాడించుచున్నావా ? రామవనవాసమే వరముగాని జానకీవనవాసము కాదుగదా ?

గీ. రాజ్యమున కర్హుఁడైన శ్రీరామచంద్రు
నర్ధదేహంబు జానకి యగుకతమున
సింహపీఠినిఁ గూర్చుండి చెలువమొప్ప
రామచంద్రార్థ మేలు నీరాజ్య మెల్ల.

కుటిలమార్గమున భర్తను లోఁబరచుకొని వరరూపమున శ్రీరామప్రభువునకు ద్రోహమొనరించినందులకు భరతునిగతియు నీగతియుఁ జూచుకొనవైతివి. అదియునుంగాక భరతుఁడు దశరథపుత్రుఁడేయైన నిన్ను తల్లిగా గణించునా ? అర్యేతరమార్గమున నీయిచ్ఛాప్రకార మొప్పుకొను ననుకొంటివా ? కల్ల. కల్ల. కాన నీవరముల మఱల్చుకొని వేవేవేని కోరికొని లోకకళ్యాణ మొనగూర్చి కీర్తనీయచరిత్రవు గమ్ము.

జా:- గురూత్తమా ! నామనోహరుఁడు వనవాసకష్టంబు లనుభవించుచుండ రాజ్యభోగంబు లాళించునంతటి యవివేకినినని తలంచితిరా? భర్తృపురోగామినిగా నెఱుఁగుఁడు.

కౌ:- (దుఃఖములో)

గీ. శ్రేష్ఠదైవజ్ఞుఁ డైనవశిష్ఠమౌని
పట్టభద్రుఁడ వౌటకుఁ గట్టినట్టి
కంకణం బిది కాంతారకందఖనన
మునకుఁ గంకణంబయ్యెనా తనయ ! యకట.

ద:- (కైకవంకఁ జూచి స్వగతము) మార్పేమియు లేదు. కాఠిన్యము నకుఁదోడు మౌఢ్యాపరావతారము. ఏమిచేయఁగలను?(నిట్టూర్పు నిగుడ్చి) సుమంత్రా ! ఈరాక్షసితో నేమి? చతురంగబలముల తోడను సర్వసంభారములతోడను వనమునకుఁ బయనమగు యత్నముఁ జేయుము.

గీ. వన్యమృగములభయము లవంబు లేక
రాజభోగయుక్తముగ శ్రీరాముఁ డుండు
వనిని, సర్వశూన్య యయోధ్య వసుధ నేలు
భరతుఁ డిచ్చట కైకేయివరమువలన.

కై:- (స్వగతము) నే నెంతయూరకున్నను వీరి యెత్తిపొడుపుమాట లసహ్యముగ నున్నవి. (ప్రకాశముగా) చతురంగాదిబలంబులు వివిధరాజభోగంబులు లేనియీపాడునేల భరతునికిమాత్రమేల ?

శ్రీ:- జననీజనకులారా ! నాజా గింతకల్లోలముఁ గూర్చుచున్నది. తండ్రీ ! ఇఁక నాలసింపఁజనదు. సెలవిండు. కృతప్రతిజ్ఞుఁడనౌ నాకు పునర్దర్శనభాగ్య మబ్బుఁగాక.

ద:- రామచంద్రా ! ఇంత నిష్కరుణయా ?

క. రేపకడ యేగఁదగు నీ
మాపటి కిట నుండు ప్రియకుమార ! విదేహా

ఙ్మాపతిపుత్రియుతముగ
నీపాటి యొనర్పుమయ్య యిద్ధచరిత్రా!

శ్రీ:- జనకా!

ఉ. నాదుమొగంబు మీకిటఁ గనంబడునంతకు నావియోగ మీ
రోదఁగలేరు, రేపయిన నేగుట తప్పదు, జాగుచేత మీ
దోదయ మంద దీజనని, కుందుట భావ్యము మాట మీఱినా
కేదొసఁగుండ దెయ్యెడల, నిప్పుడ దీవనయిండు పోయెదన్.

కా, సు:- తండ్రీ! మామాటయుం దించుక యాదరముఁ జూపుమా

శ్రీ:- గురులారా!

గీ. అసమవేగాన్వితము జనకాజ్ఞహాయము
రామనామాశ్వికు నరణ్యసీమఁ జేర్పఁ
మోసికొనిపోవుచుండె, పేర్మిముడిసమీర
మెట్లు లాపఁగలదు? విధి యెట్లు తప్పు?

తండ్రి! మమ్ము శీఘ్ర మాశీర్వదించిపంపుఁడు.

ద:- (శ్రీరాముని దిక్కై) తండ్రి!

గీ. ధర్మమె పథమ్ముగాగ సత్యమ్మె కవచ
మై వెలుఁగఁగ, జనకాజ్ఞ యనవరతము
నీకుఁ జేదోడగుచు కాన నెగడుఁగాక
శీఘ్రముగఁ బునరాగమశ్రీ కలుగుత.

సు:- తనయా! లక్ష్మణా!

గీ. రాము దశరథువిధమున, భూమిజాతఁ
దల్లిగతి, వనస్థలి నయోధ్యవలెఁ గనుచు
సుఖయుతుండవై క్రమ్మరఁజూడ రమ్మ
కనులపండువు గూర్ప లక్ష్మణకుమార!

కా:- తల్లీ! జానకీ!

క. పతివిహితకర్మముల సం
తతము సలుపు మీవు మఱదిఁ దనయునిగతి నూ
ర్జితకీర్తిఁ గనుము విభుసం
యుతవయి యచిరముగఁ గనె దయోధ్యాపురమున్.

శ్రీ:- గురువర్యా ! పోయివచ్చెద నాజ్ఞయిమ్మఁడు.

వ:- వత్సా ! శ్రీరామచంద్రా !

క. సత్యము, శౌర్యము, వినయము
నిత్యము నినుఁగొలువఁగా వనీస్థలి మునులన్
బ్రత్యహము సేవఁజేయుమ
వాత్యుల రక్కసులఁ దునిమివచ్చెను త్రుటిలోన్.

శ్రీ:- సచివాగ్రణీ ! నాకనుజ్ఞనొసఁగి దుఃఖతులు వృద్ధులు నగు జననీజనకుల నతిజాగరూకతతోఁ జూచుచు మాభరతునాజ్ఞ సుఖంబుండుఁడు. జననీ ! కైకేయీ ! నీకోర్కెదీర్చ నిదియేగు చున్నాఁడ. సుమంత్రా ! తేరాను త్తమై మొగసాల నున్నది కదా ?

సు:- ఆయుష్మంతుఁడా ! జవనాశ్వయుత మగు తేరు మొగసాల నిలిపియే వచ్చితిని.

శ్రీ. జా. ల:- (పెద్దల కందరకు నమస్కరించి లేచి) ఇదిగో వచ్చు చున్నారము! (లక్ష్మణుఁడు తోవఁజూపఁగా జానకి ముందును శ్రీరాముఁడు వెనుక నిష్క్రమించుచుండ)

ద:- హా రామా ! హా లక్ష్మణా ! హా జానకీ ! (అని సొగఁబోయి ముందరికి సొరిగిపడును)

శ్రీ:- సుమంత్రా !

చ. కడపుము తేరు శీఘ్రముగఁ గాంచఁగలే నిట తల్లిదండ్రియు
న్బడెడియనంతదుఃఖమును, పౌరసఖాస్యముల న్గనంగ నే
ర్పడుఁగద జాగు, దాని సయిపన్గలనా ? చననిమ్ము వేగ వెం
బడిఁబడునేమొ వృద్ధనరపాలుఁడు శోకపరీతచిత్తుఁడై .

సు.- ఆయుష్మంతునియాజ్ఞానుసారమే. (సుమంత్రి, లక్ష్మణ, జానకీ రాములు నిష్క్రమింతురు.)

సు:- (ఇంచుకతేఱి) రామా ! రామా ! ఏడి మారాముఁడేఁడి ! నీవే మారాముఁడవు దగ్గరకు రమ్ము (అనికౌసల్యను కౌగిలింపఁ బోవును)

కౌ:- (తప్పించుకొని) నాధా ! ఇం కెక్కడిరాముఁడు ? తేరు చూపు మేరదూర మరిగినది.

ద:- అయ్యో ! రామా ! పోయితివా ! ఏమి నాకు జగమెల్ల నంధకారబంధురముగఁ గన్పట్టుచున్నది.

గీ. అస్తగిరిగహ్వరముఁ జొచ్చి యవనిజనుల
నంధకారాన నిడెడుఛాయాధవుగతి
వనమునం జొచ్చి జానకీవల్లభుండు
నాదుదృష్టి యాకృష్ట మొనర్చె నిజము.

రామవిశ్లేష మెంతదుర్భరము ! దుర్భరము !

గీ. పుత్రశోకంబుచే మృతిఁబొందె దనుచు
మునిమిధున మన తోషంబుఁ బొంది తపుడు
సుతులు లేకుంట, నిప్పుడు సుతవియోగ
మనుభవించెద మునిపల్కు లనృత మగునె ?

(మూర్ఛిల్లును)

కౌ. సు:- హానాధా ! (మూర్ఛిల్లుదురు)

(జవనిక జారును)



శ్రీ

# శ్రీరామప్రవాసము

## తృతీయాంకము.

### 1. స్థలకము — తమసానదీతీరము.

ధనుష్పాణియై లక్ష్మణుఁ డుండఁ, సుమంత్రుఁడు శ్రీరామజానకీ పౌరులు నిదురించుచుందురు.)

సు:- (మేల్కాంచి లేచి కూరుచుండి) తండ్రీ! లక్ష్మణా! నిదురఁ బోవక యిట్లే ధనుర్బాణపాణివై కాచుచున్నావా? నీ కెంతటి కష్టము సంభవించినది!

క. ఆ కనుసన్నల వెంటనె
చేకొని యుమ రంగ పనులఁ జేసెడిభటుల్
పైకొనక స్వామి సుఖములఁ
జేకూర్చెడి కృతిని నీవ చేయ నయితివే?
సేవకాళికష్టంబు లన్నియు నిన్నే యాశ్రయించినవికదా!

చ. అనుపమరాజభోజనము, హాయిగఁ బాడఁగ హంసతూలికల్
పను లొనరింప సేవకులు, భాగ్యముల న్విడి దీనదుర్దశ
న్దినుటకు నాకలంబులును, నిద్ర గన న్తృణశయ్య, రక్షకై
ధనువును బాణము ల్గొనుట దాస్యము, నిద్దురలేమి కల్గెనే?

సౌమిత్రీ! నే కాపుండెదను. నీ వించుకసేపు కుశాస్తరణమున విశ్రమించుము.

ల:- సుమంత్రా! జ్ఞానవిదురుఁడవై నీవుకూడ పొరఁబడుచుంటివి.

సీ. జనమనోంబుజములఁ దనిపించుభాస్కర
ప్రతిమానమౌ ముఖద్యుతి వెలుంగ
సకలసర్వంసహాస్థలిరాజ్యపీఠంబు
సమతను పీనవక్షంబు తనర
క్షత్రినామంబును సార్థకం బొనరించు
నాజానుబాహుద్వయంబు చెలఁగ
దనుజాంతకం బైనధనువును శరములు
దక్షిణకరమున తళుకుగులుక

గీ. అహితహితముల నొకటిగ నరయఁజాలి
వార్ధిగంభీర మైనభావంబుతోడ
శాంతివిజితాగ్రహుం డగుసదమలాత్మ
పడెడియిడుమలఁ గన నిద్రవచ్చునొక్కొ ?

ఇట్టిసుగుణపుంజమునకు, నిట్టిధైర్యహేమాద్రికి, నిట్టిశాంతిసముద్రునకు, నిట్టిధర్మనిధానమునకు, నిట్టియసహాయశౌర్యఖని కీవనవాసకష్టంబులఁ గూర్చెను.

సుమంత్రా ! మావదినెగారిస్థితి నెంచుద మనిన

చ. జనకునిపుత్రియై సకలసౌఖ్యములొంది లలాటనేత్రుపి
ననువును లీలనెత్తిన, లతాసుకుమారశరీర సార్వభౌ
మునిచెలి యీవిధి న్నిదురఁబోవఁగఁ జూచుట శోకకోపము
లైనగొన నిల్లొనర్చువిధి బిట్టువగ న్ననఁజేయు టొప్పదే ?

సు:- నాయనా ! విధి దుర్నివార్యము, శాంతివహింతువుగాక.

ల:- సుమంత్రా ! శాంతి నేటికి వహింపవలె ? (కనులెఱ్ఱఁజేసి)

స్ర:- భూపాలున్సార్వభౌమున్నృవిజ నిడుమల న్బొందఁగాఁజేసెఁగాన
న్బాపాత్ము న్ధాత నార్తిన్బడఁగనొనరుతు న్బాణవర్షంబుచేతన్
ఆహా ! ఈకోపంబున పరమోపకారి యగుధాత నెట్లుదూరితిని ?
పాపాకారుండ ధాత న్బరుసములన దిక్పాలకు ల్గోరురామా
శ్రీపాదాబ్జాతసేవన్ స్థిరముగ నిలిపె న్నృపి న స్మేటిభక్తిన్.

సు:- సౌమిత్రీ ! రామచంద్రమూర్తి కదలుచున్నట్లున్నాఁడు. (పరికించి) లేచి కూర్చొనుచుఁగూడ నున్నాఁడు.

ల:- (ప్రదక్షిణమొనర్చి వినమ్రుఁడై నిలువఁబడి)

శ్రీ:- దీర్ఘాయుష్మాన్ భవ. తమ్ముఁడా !

తే. గీ. పూర్వపురుషునికంటెకెంపో యనంగఁ
గానఁబడునరుణోదయకాంతి మించి
రక్తిమ గ్రమ్ము నీదు నేత్రాంచలములు
వారిపూర్ణంబు లేల కావలసె ? చెపుమ.

వనవాసక్లేశముఁ దలఁచియా ? దాఁపక చెప్పుము. నీదుఃఖమునే నావంతయు సైపఁజాల.

ల:- దేవా ! అట్లేల తలంతును ? దేవరకుఁ గూర్చిన కష్టములకై విధాతను నిందించి నా కొనరించిన మేలునకై యాతని దూఁటినందులకు పశ్చాత్తప్తుఁడ నగుచుంటిని.

గీ. జానకీరామసన్నిధి సంభవింపఁ
జేసి ధన్యుఁజేసినవిరించియుపకృతికి
సంతసాంబుధిఁ దేలఁ గ్రోధాంతమయ్యె
దుఃఖబాష్పంబు లివి కావు తోషజములె.

హనుమంతుఁ డరుగుఁడు.

శ్రీ:- సుమంత్రా ! అంతియేనా ?

సు:- రామప్రభూ ! సత్యము. అంతియే.

శ్రీ:- అటులయిన సరియే. తమ్ముఁడా ! లక్ష్మణా ! అయోధ్యలో దుఃఖితు లగుజననీజనకులస్థితి యెట్లున్నదో ? ఈతలం పుద్భవించి ధైర్యవల్లిక నుఱ్ఱుటలూఁచుచున్నది. నాయనా ! నాతోడ రావలదని యనేకవిధములఁ జెప్పితిఁగదా ? వినవైతివి. ఇది మొదటి రాత్రియేకదా ! పదునాలుగుదీర్ఘవర్షములు గడువవలసియున్నవి. వనవాసకష్టములనుగూర్చి యోజించుకొనుము.

ఉ. ఎండకు వాన కోర్వనగు, నేవి లభించిన నాహరించి తృ
ప్తుండయి సౌఖ్యమన్న పదము న్మఱువన్వలె కాననంబునం
దుండఁదలంచువార, లిట నుండకతప్పదు నాకు, తండ్రి! నీ
వుండి యసౌఖ్య మొందక యయోధ్యకు నీప్రజఁగూడి యేగుమీ.

నాయనా! అల్లారుముద్దుగాఁ బెరిఁగిననీ వివ్విధముగ నిద్రాహారములు లేక శ్రమించుట నేఁజూడఁజాలను. జనకాజ్ఞానుసారము నే నీకాంతారవాసము సంతసమున ననుభవింప నొప్పుకొంటినికాని నీ కేటికి వృథాశ్రమ? నీతలంపు మాని వీరితోఁ గలిసి పురిఁజేరి జననీజనకుల శుశ్రూష యొనర్చి ధర్మవ్యాధాదుల మఱపింపుము.

ల:- అన్నా! ఇన్నిదినములనుండి మెలంగుచుండిన నామనోగతము మీకు వేద్యమేకదా? నాకీవిషమపరీక్ష మఱల నేలపెట్టెదరు? నారాకకు కష్టముపై యనుమతించితిరి. సంతసించితిని. వనవాస కష్టంబుల కొంతయు వెనుదీయను.

గీ. అన్న! నీవుండు చో టయోధ్యానగరము
సకలసుఖదంబు సంతోషసంజనకము
నీవు లేకుండు నెలవు వనీస్థలంబు
పిరికిమందిడి వెన్కకంపింపఁ దలఁతె?

శ్రీ:- లక్ష్మణా! ఈపౌరులు పథశ్రమచేతను, నాహారలోపంబునను, నన్మద్వియోగదుఃఖభరంబునను బడలి నిదురించుచున్నారు. వీరు నిదురమేల్కొని రేని మనల వెంబడింపక మానరు.

ఉ. వీరలు లేచుదన్క నిట వేచినఁ దప్పక వెంబడింతు ర
వ్వారల, నావియోగమున వందురువారలఁ బొందుపొందన
న్నో రెటులాడు? కష్టములు నూల్కొను వచ్చిన, లేవకుండ కాం
తారపథంబున న్జనుట నామతమున్ సుఖదాయకంబు నా.

సుమంత్రా! నిశ్శబ్దంబుగ రథం బాయత్తమొనర్పుము. లక్ష్మణా! సర్వసామగ్రీయుతుం డగుసుమంత్రు ననుసరింపుము. మనమద మయోధ్యవంకఁ [illegible]

ర్గంబునఁ బోవకుండిన వీరలు మనజాడ ననుసరింతురు. జానకీ సహితుఁడనై యీకాలిత్రోవనఁ గలసికొనెదను. నిశ్శబ్దముగాఁ జనుఁడు. (సుమంత్రలక్ష్మణులు నిష్క్రమింతురు.) (జానకిని లేపుచు) జానకీ ! వనవాసక్లేశమున నింకను సుఖనిద్రఁ దోఁగుచున్నావా ? చూడుము.

క. చూలాలు ప్రాగ్దిశాంగన
బాలదివాకరునిఁ గనఁగఁ బనుపు గ్రిసవంపు
న్గోలాహలమున విహగము
లోలి న్గలకల మొనర్చుచుండుట వినవో ?

జా:- (కనులఁ బులుముకొనుచు లేచి శ్రీరామునకుఁ ప్రదక్షిణనమస్కార మొనరించును)

శ్రీ:- కళ్యాణమస్తు. జానకీ ! సంధ్య చేయక న స్నను సరింపుము.

జా:- ఆర్యపుత్రులయాజ్ఞానుసారమే. (ఇరువురు సాఁగుదురు)

(యవనిక జారును)

## 2. స్థలకము — గంగాప్రాంతభూమి.

(గారచెట్టుక్రింద శ్రీరాముఁడు, జానకి యాసీనులై యుందురు లక్ష్మణుఁడు కోదండపాణియై నిలువఁబడియుండును. సుమంత్రుఁడు చేతులఁగట్టుకొని నిలువఁబడియుండును. గుహుఁడు ప్రవేశించును)

గు:- ఓ రాగారసెట్టుకింద కూకున్న పుంజు, పెట్ట ? ఆరికా డెవరో వొకా యన యిడ్లంబులబట్టుకొని, వొకడు సేతులుకట్టుకొని నిలుచుండారు. వొకరథ మాడ నిలిచున్నది. గుఱ్ఱాలు మేస్తుండాయి. దగ్గిర కెల్లి సూత్తా. (కొంచెము సమీపించి ఆపుంజుకాడకూడా అలివిమాలినయిడ్లంబు లుండాయి. రాసోళ్లుగామోసు. (నిదానించి చూచి) అయ్యో ! దేముడా ! నాకండ్లు కాల. ఏంటిది ! ఓరో కారు. దచరదయ్యగో రబ్బాయి చీరామయ్యో. ఆపెట్ట జానకమ్మో. ఆనిలబడ్డాయన లచ్మయ్యో. ఆదు రదం తోలేవోడే. అయ్యో ! మామారాజుకొడు క్కంతకట్ట మొచ్చిందిరా !

పోంయి చీరామయ్య పాదాలమీద బడుతా (ముందునకుం బోవ)

శ్రీ:- సీతాలో! యీవచ్చుచున్నది నిషాదరాజగు గుహుండే? నాప్రస్తుతస్థితికి సగమును మనుఁగాంచివచ్చుచున్నాఁడు. (ముందునకు నడచి గుహుని కవుంగిలించుకొనుచు)

ఆ. క్షేమసంయుతులరె స్నేహితు ల్బంధుగు
ల్వాఁడము సౌఖ్యముగను వఱలుచున్నారా ?
క్రూరసత్వబాధ కూడదుగా మిమ్ము ?
గుహుండ ! శుభము వినఁగఁ గోరువాఁడ.

గు:- మహాప్రభూ ! మీదయున్నంతమటుకు సుగముగాక దుక్కమే ? అయ్యో ! చీరామయ్య ! ఇదయే మేసాలయ్యా !

గీ. రాళ్ల భంగారుచోమ్ముల, రంగుమీఱి
ప్రాప మెరిసెడిబట్టల మీదగట్టు
మీరుఁ దమ్ముండు యిట్టుల నారసీర
గట్ట మెయిసూడగలమయా ? కన్నతండ్రి !

నాకాడ కావలసినన్ని సన్నసన్న పేనాబట్టలుండాయి. నాయింట్లు, వాకిండ్లు, నాగొడ్లు గోదలు, మఱేందుకయ్యా నాయన్ని మీయి. మీ కిచ్చావిసూరం గుండండి బాబూ ! మీరు మమ్మల్నేలండి బాబూ ! మా కింకేమికావాలి ? బాబులపాదాలకాడ సేవజేస్తూ డమే నాకు పెబుత్తా. రాకరాక మాసీమకొచ్చేరు కదండీ ! బాబుల్లాలా ! రాండి బాబూ ! అయ్యోద్దె మఱచేలాగా సుగపెడ్తా.

గీ. చీకలలోకంబులకు తల్లి జానకమ్మ
అయ్య ! వాటి కయ్యవుగ ? రామయ్య తండ్రి !
మాకు బత్తుల కన్న లచ్మన్నకాదె
బందుగులు వచ్చితిరి నేడు పండగాయె.

ఓరేయి నాగులూ లగెత్తరా. (నాగులు పరుగునఁ బ్రవేశించును)

నా:- పెబుల్లాలా! అందరికి దండాలు. ఏమి చెలవు ?

గు:- నాగులూ! మంచి పులిజున్ను, పుట్టతేనె, సారపప్పు నీవు మోచినంత దేరా. ఈమా రాజులకడుపులు డొక్క డోరంటు న్నాయి. నకసకలాడే కడుపుసొద దీరాలె ముందుపో ముందు. ఆలచ్చం చేచేవు. డొక్క సీరేత్తా.

నా:- (నిష్క్రమించి పైనస్తువులతో పరుగునఁ బ్రవేశించి గుహునితో) పెబో! యియుగో.

గు:- మహాప్పెబో! వీటిని దీస్కొని ఆరగించేండి.

శ్రీ:- (స్వీకరించి) జానకీ! వీనిని తీసికొనుము. సోదరా! నీవుకూడ.

జా. ల:- మహాప్రసాదము. (తీసికొని లక్ష్మణుఁడు నిష్క్రమించును)

శ్రీ:- (స్వగతము) ఏమి యీగుహునిభక్తి! నిషాదుఁడయ్యును పరమ సాధువు.తనసర్వస్వము నాకర్పణమొనర్ప సంసిద్ధుఁడై యున్నాఁడే! వీనిత్యాగ మతిశ్లాఘ్యము.

ఉ. మెచ్చితి, నీదుకట్టెదుట మిత్రుఁడ చెప్పుటకాద, యొదరో
యిచ్చిరి స్వామ్యము ల్నజరు లేటికి ? మెప్పునకో, భయంబుచే
నిచ్చుటొ కాని, నీపగిది నిచ్చినవారలు లేరు భక్తిచే
నచ్చెను నీసపర్యలు ఘనంబు లిఁకే మొనరింతు నీకిటఁ ?

గు:- మహాప్పెబో! చీరామయ్యా! మీ దయెుల్ల నా కేంలోపం లేదు. ఇదే నాయిల్లు. ఈరో జీడుండండని నామనివి.

శ్రీ:- గుహా! అవశ్య మటులే కావచ్చునుకాని జనకునాజ్ఞ పదునాల్గు వత్సరములు పురప్రవేశము వీలులే దిచ్చటనే యుండెద.

క॥ ఈవారుపములు దశరథ
భూవరునకుఁ బ్రియములగుటఁ బూజ్యంబులు వం
భా వార్వాభాదనంబుల
భూవరుమారుగను వీనిఁ బూజింపు హితా!

అటులయిన మేము పరమసంతోషము నొందెదము.

గు:- నాగులూ! ఈగుర్తాలకు మంచిదాణా యేసి మాలీసుసెయ్యి. జాగర్త.

నా:- సెబో! సిత్తం.

గు:- మహాప్పబో! మీకోసరం మెత్తటిదబ్బలు పరిసి పక్కేశాం. సుకంగా తొంగోండి.

శ్రీ:- గుహా!

గీ. ఆదరము లేక యిడెడిదివ్యాన్నచయము
కంటె సద్భక్తి నొసఁగెడికాయ పండె
యాపరిమితతృప్తి యిడునన నలసియున్న
మాకు నీసాదరవువిం దమాన్య మగునె?

జానకీ! ఈకుశాస్తరణమున విశ్రమింపుము. నే నిచ్చట పరుండెద. తమ్ముఁడా నీకుఁగూడ కుశశయ్య యమర్పఁబడి యున్నది కదా? కొంచెము విశ్రమింపుము.

ల:- అగ్రజా! వదినెగారును మీరును విశ్రమింపుఁడు. నే విశ్రమించెద లెంక.

శ్రీ. జా:- (ఇరువురు విశ్రమింతురు)

ల:- ధనుర్బాణపాణియై కాచుచుండును.

గు:- లచ్మయ్యా! నీవూ తొంగో బాబూ. నాను నాబంట్లుండ్లే గస్తీ తిరిగేందుకు? ఏం బయం లేదు. వండుకో.

ఆ. చింగములను, బులుల, చిఱుతల, నెలుగుల
నేటు కొక్కమెకము గీటడంతు
వైరు లెంతవారు వచ్చిన మావాళ్ళ
బంపి వాళ్ళదుంప దెంపువాఁడ.

బయం లేనేలేదు. ఎదమీద సెయ్యేసొకొని గుట్టుపెట్టి నిద్దర పోండి. పొద్దుపొడుపున మీరాయిచ్చావియారంగా పోవచ్చు. నా మాటిని పడుకోండి.

ల:- గుహా! ఏమినంతోషముఁ జూచుకొని నిదురవచ్చునయా?

గీ. చక్రవర్తి కాఁదగురామచంద్రమూర్తి
యడవిఁ దిరుగుట కొప్పినయాక్షణంబె
నానిదుర వన్యమృగములఁ బూనె పవల
పైన నిద్రావిహీనుఁడ నైతి నేను.

నా కేవిధముననను నిదురరాదు. నీవైనఁ బరుండుము.

గు:- (పరుండి గుఱ్ఱుపెట్టును)

ల:- ఆహా! కాలచక్ర మెంతలో తిరిగిపోవుచున్నది? మూడవ యామముకూడ మించినది. ఏమి యీపరిభ్రమణవేగము? కాదు. కాదు. అనన్యార్థసేవాపద మబ్బినందున నామనస్సున కట్లు తోఁచుచున్నదిగాని కాలచక్రవేగ మొక్కటేకదా!

సీ. తనకు ననుకూలమై విధి తనరెనేని
కష్టము సుఖంబు, యుగమైన క్షణము యగును
తన కననుకూలమై విధి తనరెనేని
సుఖము కష్టంబు, క్షణము యామా యుగంబు!

అరుణోదయకాలముకూడ సమీపించుచున్నట్లున్నది.

చ. వరమునొసంగి తన్నుఁడి వ్యర్థముచేయకు భూప, రాము స
త్వరముగఁ బంపు మిప్డె వనవాస మొనర్ప నటంచుఁ గైక వే
గిర మొనరింపఁ దాల్చికనుకెంపనఁ దూరుపుకొండబోటునం
దరుణిమ తోఁచుచున్నది మదగ్రజుఁ డిప్పుడు లేచువేళయే.

శ్రీ:- తమ్ముఁడా! సౌమిత్రీ!

ల:- (అన్నకుఁ బ్రదక్షిణనమస్కారములు చేసి)

శ్రీ:- ఆయుష్మాన్ భవ.

సు:- (నమస్కరించి) మహాప్రభూ! రామచంద్రా! నాకతి యే మొనర్పఁదలఁచితివి? నేఁగూడ మిము వెంబడింప ననుజ్ఞయిందు. మిట్టపల్లములైనభూములు మీకు కష్టమొసంగకుండునటుల వథ

శ్రమ లేకుండఁజేయుటచే పదునాలుగుసంవత్సరములు పదునాల్గు దినములట్లు గడువఁజేసెద.

శ్రీ:- సుమంత్రా ! నీవంతకు చాలుదువు. కాని నేఁ జెప్పునది శ్రద్ధగ వినుము.

**ఉ.** నీవు రథంబున న్వనక నిల్చినఁ దండ్రియుఁ గ్రైక రాముఁ డే
దో వచియించెఁగాని చనియుండఁడు కాననసీమ కంచు దు
ర్భావనముఁబూని తమ్ముననుఁ బట్టముఁగట్ట, రరాజకంబుకాఁ
బోవు నయోధ్య, నీవటకుఁ బోయిన సర్వము చక్కనయ్యెడిన్.

అదియెట్లన నీవు జనకునకుఁ గానఁబడగనే నే వనంబునకుఁ బోయితిననియు, మఱలననియుఁ దలఁచి తండ్రి భరతుని పట్టాభిషిక్తుఁ జేసి నాపైనిపేరిమడి యాతనిపైకి మార్చుకొనును. కైకాదేవి సంతసించును. ప్రజలు నాపై ననురాగము విడిచి భరతుని యెడల రాజభక్తిఁ జూపుదురు. నీవు పోకుండిన నివి యెల్ల తాఱుమాఱగును. యోచించితివా ? అదియునుగాక మాకుమారు వృద్ధుల, దుఃఖితు లగు ననీజనకుల నోదార్ప నీవే సమర్థుఁడవు నాప్రార్థన మంగీకరించి రథసమేతుఁడవై తరలుము.

సు:- (దీనాననుఁడై వగచుచు) మహాప్రభూ ! నే నాజ్ఞార్హుఁడనేకాని ప్రార్థనార్హుఁడను కాదుకదా ? నాభాగ్య మిట్లున్నది. దయమాత్ర ముంచుఁడు. భవదాజ్ఞానుసారమే వర్తించెద. (మ్రొక్కును)

శ్రీ:- (లేవఁదీసి) సుమంత్రా !

శ్రీ జా ల:- ధీమంతుఁడవు జ్ఞానవిదుండవగునీకు సర్వశ్రేయములుఁ గలుగుఁగాక.

సు:- మహాప్రభూ ! సెలవు.

శ్రీ:- సుమంత్రా ! సుఖమునఁ బోయిరమ్ము. అచిరమునఁ బునర్దర్శన భాగ్యము చేకూరుఁగాక.

సు:- మహాప్రసాదము. (నిష్క్రమించును)

ల:- అగ్రజా ! ఏమియాజ్ఞ ?

శ్రీ:- తమ్ముఁడా! గుహుఁ డింకను నిద్రించుచున్నాఁడు. ఆతని లేపుము.

ల:- చిత్తము. గుహా గుహా! (తట్టి లేపును)

గు:- (కనుల నలుపుకొనుచు లేచి) చీరామయ్యతండ్రీ! జానకమ్మ తల్లీ! దండా. దండం. లచ్మన్నా! దండం.

శ్రీ. జా. ల:- చిరంజీవ. సౌభాగ్యసిద్ధిరస్తు.

గు:- కడ తేర్రా బాబూ! ఏమి చెలవు?

శ్రీ:- మమ్ము సత్వరమ గంగ దాటింపుము.

గు:- చరే కాని బాబూ. ఒక్క చందేయం వుండదయ్యా!

శ్రీ:- ఏమిటది గుహా! సత్వరమ చెప్పుము.

గు:- చమించాలె బాబూ!

ఆ. బాబు కాలిదూళి పడి యొకచట్రాయి
పెట్ట యయ్యె ననిగి పెద్దవోళ్లు
యీడ తెవ్వ, ధూలి సేడ సేయునో యేమొ?
కడుగుదయ్య పెబుని కాళ్ళు ముందు.

(కాళ్ళుకడిగి నెత్తిన చల్లుకొని పై బట్టతోఁ గాళ్ళఁదుడిచి భుజమున నెక్కించుకొనును.)

జా:- (చిరునవ్వుతో) ఆర్యపుత్రులకు నరవాహనము కడు తెన్నుగ నున్నది.

శ్రీ:- జానకీ! నీపరిహాసమున కేమిలే. గుహా! నీభక్తి వర్ణనాతీతము. అట్టిభయ మేమియు లేదు. నన్ను దింపి తక్షణము గంగ దాటింపుము.

గు:- సిత్తం మహాప్పెబో! (దించి) నాగులూ! తండేల్ను పిలిసి పెబువులగారికి మన "అంచయానను" చిద్దం చెయ్యమనిచెప్పు. (వినుటనభినయించి) చిద్దం చేయిస్తున్నానంటున్నావా? సరే బాబుల్లాలా! అదుగో సూడండి.

గీ. రాసవో లెక్కదగినదై రంగుమీఱి
ముక్కుతో గంగ చేలెడిపూల నెల్ల
పొడుచుకొని తింటు గంగమ్మపొట్టమీద
యాడుచును మిమ్ము దాటించు సంచియాన.

రాండి పెబుల్లాలా ! రాండి. జానకమ్మతల్లి రాండి.

సీత:- (సంతోషముతో) గుహా! ఈరతనాలహారము మనస్నేహలాంఛనముగా తీసికొనుము. (ఇయ్యఁబోవును)

గు:- (చెంపలు వేసికొని) బాబూ! తప్పు. తప్పు. మోటుమానిసిని క్షమించాలె. నాకెందుకయ్యా యీరాళ్ళహారం ? వొద్దు బాబూ! వొద్దు.

ఆ. కులమువోరికాడ కోరుదుమే కేవు !
గంగ నిపుడె మిమ్ము గడవవేతు
నటులె కేవు లేక పుటక తరగపైని
గొడ్డు నిన్ను జేర నొప్పికొనవె.

(అని పాదములమీఁదఁబడి లేవకుండును.)

సీ:- వత్సా! గుహా! లెమ్ము. నీభక్తి యనుపమానము అనన్యము.

గీ. దనుజబాలుండు ధ్రువుఁడును దాల్చినట్టి
భక్తిమించిన సాదరభావమునను
పూజసలిపితివిగ ! భవాంభోధి దాటి
నన్నుఁ జేరినాఁడవు శ్రద్ధ నావనెక్కి.

ల:- గుహా! భాగ్యమనిన నీదె భాగ్యము.

క. వానల, నెండల నియమము
తో నాకలములను వర్షతోయము, గాలి
న్బానికఁ దినుచు దపించెడి
మౌనుల మించితివి భక్తిమార్గముచేతన్.

రా:- గుహా! సర్వకళ్యాణ మస్తు. ఇంకేమైన కోర్కెకలదా!

గు:- జానకమ్మతల్లీ ! నా కేమిఁ గోరవలేదు. శ్రీరామయ్య నన్ను తనోణ్ణిగా తలసి బత్తులలో కల్పుకొన్నాడు. తెప్ప దాటాసమ్మ రాండి. బాబుల్లాలా ! నే సొంతంగా పెబువుల్ను గంగ దాటిత్తా ఇటు ఇటు (త్రోవఁజూపును)

శ్రీ. జా. ల:- గుహా! ఇదిగో వచ్చుచున్నారము. మునివేసములఁ గనవగు జటల ధరింపవలయు. మఱ్ఱిపాలఁ దీసికొనిరమ్ము. జటల ధరించి నావ నడుగిడెదము.

గు:- మహాప్పెబో ! అట్లాగె తెత్తా మీరాండి బాబూ !
(యవనిక జారును.)

### 3. స్థలకము — భరద్వాజాశ్రమప్రాంతము.

(శ్రీరామ, జానకీ, లక్ష్మణు లుందురు)

శ్రీ:- తమ్ముఁడా ! సౌమిత్రీ ! ఆకానసగునదే భరద్వాజాశ్రమము. ఆమునివృషభుదర్శన మొనర్చెదము.

చ. జడల ధరించి తాపసులచాయ వహించిన రాజలాంఛనా
ల్బెడిదఁపువిండ్లు హస్తముల, వీపుల వ్రేలెడితూణయుగ్మము
నడుగఠినంపుచూపులను గ్రాల తపోవనసత్త్వము ల్భయం
పడుచు ధ్వనించుచు న్పరుగువారెడి సద్దనల న్మహార్తిచేఁ.

ఈకోలాహలము నిష్ఠాగరిష్ఠులగు తపస్వులఁ జలింపఁజేసి తపోవిఘ్న మొనరింపకుండుఁగాక.

గీ. రాజగవనుల, ధనికతోరణములకడ
వచ్చుపెఱవారిఁ దెలిపెడిభటకదంబ
మట్లు తాపసావాసప్రాంతములనుండి
పరులరాక నెఱింగించుఁ బక్షితతి.

ల:- అగ్రజా ! కాంచు మీతపోవన శాంతభావము.

మ. అరిషడ్వర్గము చేరరానిస్థలమై యశాంతిబుజాల్మధురీ
స్వరితంబై, భవపంకసంహాననదీక్షాబద్ధులౌ సన్ముని

శ్వరసద్విశ్వసమాజవాసమయి, శైశవవ్యాఘ్రముఖాన్యంబులౌ
పరమస్నేహపరీతవైరిమృగ సంభావ్యంబు హా శ్రేష్ఠముల్.

మనరాక మునీశ్వరుల కెఱిగింపవలయుఁగదా ?

శ్రీ:- సౌమిత్రీ ! అటులే యొనర్పుము. (మువ్వురు ముందునకు సాఁగ ఋషికుమారుఁడు ప్రవేశించును)

ఋ. కు:- (స్వగతము)

గీ. వల్కలంబులఁగట్టఁ దపస్వి లేమొ ?
చాపధారుతా కతమున భూపు లేమొ ?
వల్కలంబులు చాపము ల్వఱలుకతన
రాజఋషివర్యు లేమొ గౌరవ మొనర్తు.

(ప్రకాశముగా) రాజర్షివర్యులారా ! తమ దేయాశ్రమము ? తమరాక గురువులవారి కెఱింగింతునా ?

శ్రీ:- ఋషికుమారా ! దాశరథులు తమదర్శనార్థులై యాశ్రమద్వారమున నాజ్ఞకై వేచియున్నారని మనవిఁజేయుఁడు.

ఋ. కు:- శీఘ్రముగ వచ్చెదను (అని నిష్క్రమించి పునఃప్రవేశ మొనర్చి) సత్వరమ దయచేయుఁడని వారియాజ్ఞ.

శ్రీ. జా. ల:- మహాప్రసాదము.

ఋ. కు:- ఇటు. ఇటు. దయచేయుఁడు (త్రోవఁజూప సాఁగ తెరలేవ భరద్వాజఋషి యగ్నికార్యము నెఱవేర్చుచుండును)

శ్రీ. ల:- (ధనుర్బాణము లట బెట్టుదురు)

శ్రీ. జా. ల:- (సాష్టాంగదండప్రణామ మొనరించి లేచి వినమ్రులై యుందురు)

భ:- చేసన్నచే దర్భాసనములఁ గూర్చుండ నియమించును. దర్భాసనముల నాసీను లగుదురు) సర్వం శ్రీరామార్పణ మస్తు (లేచును)

శ్రీ. జా. ల:- (లేతురు)

శ్రీ:- ఆ. రాఘవులము, దాశరథుల, మగ్రజుఁడను
రాముఁ డండ్రు నన్ను, భూమిజాత
నాదుభార్య యీపె, సోదరుం డితఁడు సు
లక్షణాంకితుండు లక్ష్మణుండు.

క. జనకునియాజ్ఞ న్నరవ
నవనికిం జనుదేర వెంటవచ్చెను సతి యీ
జనకజయు. భ్రాతృవత్సల
తను లక్ష్మణుఁ డరుగుదెంచెఁ దాపసవర్యా !

భ:- శిష్యా ! రాఘవులఁ బూజింప నర్ఘ్య, జలాన్నరసఫలములఁ గొని తెమ్ము.

ఋ. కు:- (నిష్క్రమించి సపరికరుఁడై ప్రవేశించును.)

భ:- (శ్రీరాముని పూజించి) శ్రీరామా ! దశరథరామా! దశరథుఁడు పత్నీసమేతుఁడై కుశలియేనా ? రాజ్యమునకు సుఖమేకదా ?

శ్రీ:- తపోధనులయనుగ్రహ ముండుదనుక కుశలముకాక మఱే మగును ?

భ:- గీ. వనికి మునివృత్తిమై నీవు వత్తువనుచు
నాదికవినోట వింటిని యనఘ ! నీదు
దర్శనముఁ గోరునాకు సంతసము కలిగె
యిటనె వసియింపుమయ్య యథేచ్ఛగాను.

క. దూరముననుండి తపసులఁ
గూరిమిఁ బ్రోచితివి ధీరగుణ మేపారఁగ
జేరువకు వచ్చి తిప్పుడు
వారలసంతసము నెంచవశమె నలువకుఁగా ?
ఇచ్చోటు బహుసుఖదము.

శ్రీ:- తపోధనా ! సత్యమే, తమయాజ్ఞానుసార మటులే చేయనగుఁ గాని.

చ. అతిసుకుమారి జానకి విహారకుతూహల మేకతంబు సం
తతనవపుష్పసంయుతలతాగృహవేష్టిత మాచు, సత్ఫలా
న్వితధరణీజసంతతుల వేడ్కఁగొను న్దగుచోటుఁ జూపిన
న్గుతుకముతోడ కాల మనుకూలగతి న్గడపంగ నెంచితిన్.
అదియునుంగాక యిటనుండిన మునీశ్వరులయెడ నపచార
మొనర్పవలసివచ్చు నేమోయని సంశయము వొడముచున్నది.

ఉ. పౌరులు వేనవేలు కనవచ్చుచునుందురు నన్ను నిత్యము
న్వారలరాక దేవరతపంబును విఘ్న మొనర్చుఁ గావున
న్దూరమునందు నేకతమ తోషమున న్గడపంగ నెంతు నో
సారవిచార! యింపయినచక్కి యొకం డెఱిగింపు ప్రమొక్కెదన్

భ:- రఘువీరా! నీయునికి కాని పౌరాగమనంబు కాని మాతపోవిఘ్న
కారణములు కావు. అయినను జానకీయుక్తుఁడవై నీ వేకతంబున
నుండునిచ్ఛఁ గొంటివి కాన చెప్పెద.

గీ. గంధమాదనతుల్యశౌ కపికులంబు
ఋక్షసముదాయమున కహర్నిశము తావ
లంబు ననఘంబు చిత్రకూటంబు నాగ
తనరునగము దశక్రోశమునను కనుమి॥ (ప్రేలఁజూపును)
అదియే యానగము. మృదుమధురఫలపానీయసమన్వితమగుట
సౌఖ్యనిధానము. ఈనాయంతన మిట నాయొనర్చుసపర్యలంది
రేపట నట కరుగవచ్చును.

శ్రీ:- ఋషివృషభా! అటులే కానిండు. సౌమిత్రీ!

గీ॥ అదిగో కాళిందిలోఁ గల్గునట్టిపుండ
రీకముల కోకనదముల మూఁకఁ జేర్చి
పశ్చిమాంబుధికిని సంధ్యవార్చఁ బోవు
భానుడే; మన మిఁక సంధ్యవార్చవలదె?

భ:- శ్రీరామ లక్ష్మణులారా! కాళిందికిఁబోయి సాంధ్యకృత్యములఁ
దీర్చుకొనివత్తము.

శ్రీ. ల:- చిత్తము. (యవనిక వోడును.)

### 4. స్థలకము భరద్వాజాశ్రమము.

(శ్రీరామజానకీలక్ష్మణు లుందురు)

శ్రీ:- భరద్వాజఋషిచంద్రునిచే రాత్రియే యనుజ్ఞాతుండ నైతిఁగదా? పయనము సాఁగింపనగు. తమ్ముఁడా! సౌమిత్రి!

చ. ఒకకరమందు చాపము,మఱొండుకరంబున బాణ మొప్ప రా
త్రి కనులు కూర్కకుండఁగ బ్రతిష్ఠితజాగర మూని యల్లె ని
ల్చుకొని కిరీటిరీతి నరచూడ్కన నున్నయనుంగుతమ్ముఁడా
శుకపికశారి కారుతము సూర్యునిరాక నెఱుంగఁజేసెడిఁ.
సత్వరమ చిత్రకూటము జేరవలయును. పయనముకమ్ము.

ల:- (ప్రదక్షిణనమస్కారముచేసి) అగ్రజునాజ్ఞానుసారమే.

జా.ల (సాఁగుదురు)

శ్రీ:- జానకీ! ఆపలాశమహీజంబులఁ జూచితివా?

గీ. భాగ్యవంతులయింటి దీపంబు లనఁగ
రామవనవాసయాత్రకు రమణమీఱ
కట్టబడినట్టి టెక్కెంపుగమి యనఁగ
నాపలాశసుమంబులయంద మొప్పు.

జా:- ఆర్యపుత్రా! అగును.

శ్రీ:- మైథిలీ! ఆవంక జూడుము.

క. ఫలభారంబున జీడులు
యిలఁదాకఁగ వంగి జనుల కెంతో ముదమ్మౌ
గొలుపుచు కొమ్మలకరముల
ఫలహారం బిడఁగఁ బిలుచు పర్వేందుముఖీ!

జా:- నాథా! కడురమణీయముగ నున్నవి.

శ్రీ:- సౌమిత్రీ! ఆయత్యున్నతవృక్షాగ్రములనుండి వ్రేలుచున్న తేనె పెరల గాంచితివా?

గీ. తాను దినకను యొరుల కింతైన నీక
భూవివరములన్నో వృక్షములకొనలనొ
కృపణుఁ డిడులిచ్చి, మధుప మార్జించుమధువు
చోర, మధుమృగయులపాలి సొమ్ముకాదె ?

ల:- అన్నా ! అగును.

జా:- నాథా ! ఆవృక్షశాఖలచలన మెంతభావగర్భముగా నున్నదో చూడుఁడు.

గీ. ఇంతమధుభారమును కొమ్మ లెట్లుమోయ
నగును ? పాంథులు కొనుఁడు సాయంబు సలుపుఁ
డనుచు చేఁజేత జనహృదయములు కరుఁగ
రమ్మనెడిరీతి కదలు నీకొమ్మ లధిప !

శ్రీ:- జానకీ ! బహుబాగుగఁ జెప్పితివి. లక్ష్మణా ! జానకిభావ మెంత ప్రౌఢముగ నున్నదో చూచితివా ?

ల:- వధూనిక యగ్రజనర్ధాంగికదా ?

గీ. వేడుగడ మీారు, జనకరాజేంద్రపుట్టి
లతిక, భావంబు లెపుడు తుల్యములె, కాని
తీవె సాఁగును కావున భావములను
యేడుగడ మించు లతిక, రాజేంద్రచంద్ర !

శ్రీ:- తమ్ముడా ! నీభావము మఱింతబాగుగ నున్నది. మాటలతోఁ దోవ బాగుగ సాఁగినది. భరద్వాజఋషిచంద్రుఁడు చెప్పుటలో చిత్రకూట మనేకమునిగణసేవితమని చెప్పియుండెఁగదా ? ఆయాశ్రమపరిసరమునఁ జూడుము.

గీ. మదపుటేనుఁగుసింగంపుమైత్రిఁ గనుమి
బర్హియురగంపుసఖ్యభావంబుఁ జూడు
మృగము బెబ్బులిస్నేహంపురీతి యదిగో
యేతపోరాశినిలయమో తెలియఁగనగును.

శ్రీ. జా. ల:- (కొంతదనుక ముందునకు సాఁగి)

శ్రీ:- ఆశ్రమద్వారమునఁగూడ నెవ్వరుకానరారు. ఇది యెవరియాశ్రమమై యుండునో ?

ల:- అగ్రజా ! ఎవరిదైననేమి లోని కేగఁగూడదా ?

శ్రీ:- అనుజా ! అటుల కాదు. వేగిరపడకుము.

> గీ. శాపచాపధారులు మునీశ్వరులు వారి
> వాక్శరమమోఘమగుచును వఱలుఁ గాన
> వారిపట్టున శాంతియే భావ్య మనుజ !
> తామసము తా మసి యొసర్చుఁ దామసులను.

ల:- అగ్రజా ! ఆయుటజమున కావల కానఁబడుపుట్ట యేమిటో ?

జా:- వత్సా ! లక్ష్మణా ! అది వాల్మీకాశ్రమమా యేమి ?

శ్రీ:- దేవియూహ సమంజసముగా నున్నది. సందియమేల ? అదియే యగును.

> ఆ. కేతనములఁబట్టి భూతలపతులఁ దా
> మెఱుఁగుచుండి రింతవఱకు జనులు
> వామలూరువుఁ గని వాల్మీకి నెలవని
> బుద్ధిసూక్ష్మమునను బోల్చి తౌర !

ఆశ్రమవాసులకు మనరాక యెఱింగింపవలయు.

ల:- చిత్తము. (బిగ్గరగా) మునిచంద్రా ! దాశరథులు తమయాజ్ఞకై యుటజద్వారమున వేచియున్నారు.

(తెరలో)

పూజ్యులారా ! వచ్చుచున్నాఁడ.

శ్రీ:- అదిగో మునిశార్దూలునిగంభీరస్వరము. వచ్చుచున్నామని యనుచున్నారు.

(వాల్మీకి పూజాద్రవ్యయుక్తుఁడై ప్రవేశించును.)

శ్రీ. జా. ల:- (సాష్టాంగ దండప్రణామ మొనర్చి లేతురు.)

వా:- దీర్ఘాయుష్మాన్ భవ. రఘువీరులారా ! కళ్యాణీ ! జానకీ ! ఈ యాసనముల నధివసింపుఁడు. (విధ్యుక్తముగఁ బూజించి)

గీ. సేమమేకద దశరథక్షితిపతికిని ?
మీదుమాతలకును ? సర్వమిత్రతతికి ?
రాజ్యమునకును ? మీర లరణ్యమునకు
రాఁగతంబేమి యిటు రాజయోగులట్లు ?

శ్రీ:- తాపసాగ్రణీ ! సర్వజ్ఞుల రగుతమకుఁ దెలియకనా ? అడిగితిరి కాన మనవిఁజేసికొనుచున్నాఁడ.

చ. వరములటంచుఁ గైక జనవల్లభుఁ వేఁడెను నన్ను కానకు
న్భరతునిరాజ్యమేలఁగను బంచేఁగ ; సత్యధురీణుడైన యా
నరపతి మాటనిల్పఁగ వనస్థలిఁ జేరితి సాధ్వియైననా
తరుణియు, భాతృవత్సలుఁడు తమ్ముఁడు లక్ష్మణుఁడు న్గమింపఁగన్.

వా:- బళిరా ! రామచంద్రా ! నీవంటితనయులు, జానకివంటిభార్యలు, లక్ష్మణునివంటితమ్ము లుండుటఁగదా ధర్మమింకను వ్యత్యస్తము కాకయున్నది ? ఇంతకు మాభాగ్య మనుపమానము.

గీ. పౌరులం గావ నుపయోగపడెడి మీదు
సత్త్వమెల్లను సాత్వికసంయుతు లగు
సంయములఁ గావఁ గాంచును సార్థకంబు
మిమ్ముఁ గాంచుటఁ గందు మోదమ్ము మునులు.

ఇచట నొకపర్ణశాల నిర్మించుకొని సుఖముగ నుండుఁడు.

శ్రీ:- దేవరయాజ్ఞానుసారమే. సౌమిత్రీ ! వినుము.

గీ. చిత్రకూటాద్రినెత్తంబు చెలువమగుచు
దూరదృష్టికిఁ గూరుచు, క్రూరజంతు
సంతతుల కగమ్యంబయి సౌధమటుల
లీలఁ గూర్చెడి నట పర్ణశాలకనువు.

ల:- మహాప్రసాదము.

శ్రీ:- పర్ణశాలముగిసిన తత్క్షణమే వాస్తుశమనవిధి విధ్యుక్తముగ నెఱపి శాలాప్రవేశమొనర్తము.

ల:- ప్రభునాజ్ఞ సత్వర నిర్వర్తనీయము. (విష్క్రమింతురు.)

సీ:- జానకీరాములారా! ఉటజాంతర్భాగమున విశ్రమింపుడు.

శ్రీ. రా:- మహాప్రసాదము. సహోదరానాజ్ఞానుసారమే.

(యవనిక జారును.)



శ్రీ

# శ్రీరామప్రవాసము



## చతురాంకము.

### 1. స్థలకము — ప్రతిమాగృహప్రాంతభూమి.

(భరతుఁడు ప్రవేశించును)

భ:- చ. అదరెడి వామనేత్రము, నసహ్యములౌ శకునంబులుగూర్పు, పైన క
ట్టెదురుగ మహారగము బగుపడె, స్వనించగాకము కట్టె నేటికో?

(అయోధ్యదిక్కై)

యదె కనవా నయోధ్య దరహాసము తక్కి కళావిహీనమై
హృదయము తల్లడిల్లెడిని హేయశుభంబు వినంగనౌనొకో?

జాగుయచేక తత్క్షణ మయోధ్యకు రమ్మని వశిష్ఠునాజ్ఞ, సుమంత్రుని ప్రార్థన తల్లులశాసనమంట. నారాక వశిష్ఠాదులకు మున్నెఱింగింప శత్రుఘ్నుని రథంబుపైఁ బంపితిని. అది తిరిగి

వచ్చుచుండును. పురప్రవేశమునకు ముందు ప్రతిమాగృహము బ్రవేశించి పితామహాదులప్రతిమల కభివందనము నర్పింప. (ప్రతిమాగృహప్రవేశ మొనరించును)

(ఆర్యుడు ప్రవేశించును)

ఆ:- నృపపుత్రున కభివాదనములు.

భ:- ఆర్యా ! పితృపితామహాదుల దర్శింప వచ్చితిని. అమంగళము ప్రతిహతమగుగాక. (దిలీపప్రతిమ జూచి)

ఉ. సేవయొనర్చు 'నందిని' భుజింపదలంచుమృగేంద్రు జెంపగా జేవతొలంగ జూచితి వశిష్ఠహితార్థము, నాశ్రితావనా భావముచే స్వకాయమును పంచముఖామిషము నొ్నర్చు స ద్భావు 'దిలీపు' వృద్ధప్రపితామహుని న్నుతిజేసి మ్రొక్కెదన్.

ఉ. 'నందిని' సంతసించి, జననాయక ! పాలను గ్రోలుమన్న, గ్రోలం దగదంచు కాంక్షితఫలంబయిన న్గురునాజ్ఞ లేమిచే బొందగ నిచ్చగింకొననిపూరుషసింహు 'దిలీపు' వంశక ర్తం దలితారి, వృద్ధప్రపితామహు సన్నుతిజేసి మ్రొక్కెదన్.

(రఘుప్రతిమను జూచి)

ఉ. నూరవయశ్వమేధమును నూల్కొనన్ దండ్రిహయంబుగొన్నయా చోరు సురేంద్రు దాకి, రిపుసూదనవృత్తి దనల్పి మించి, పె న్నీరుడవాచు దత్ఫలము దెచ్చి పిత న్దనిపించినట్టియు ద్దామణశౌర్యభూషు ప్రపితామహునిన్ రఘువు న్భజించెదన్.

ఉ. శ్రీ గణియించి, సర్వారిపుసింహుల గెల్చి, యఖండ 'విశ్వజి ద్యాగము జేసి రిక్తత నిజాశ్రితు కౌత్సునికై కుబేరుపై కేగ గనెంచగా గనకవృష్టిని నాతనిచేత బొందున త్యాగి, యఖండకీర్తి బ్రపితామహునిన్ 'రఘువు' న్భజించెదన్.

(అజప్రతిమ జూచి)

గీ. కోరినధనంబుకంటె విస్తారధనము బొందుకౌత్సునాశీస్సుచే పుణ్యబాహ్మ

సమయమున నుద్భవించి 'యజిత' వహించి
మాన్యుఁడౌ ధీరు మత్పితామహుఁ డలంతు.

మ. కరిగా నున్నప్రియంవదు న్శాపమున న్గారించి తచ్చాపబం
ధురవంకం బెడఁబావ, నాతఁడును సంతోషించి సన్మోహనా
స్త్రరహస్యం బెఱిఁగింప వైరివరుల న్జక్కాడి శౌర్యోందరా
స్ఫురణుండై "సజుస" న్బితామహుని నిచ్చో భక్తి సేవించెదన్.

(దశరథప్రతిమను సమీపించుచు) ఆర్యా! నేటియవశకున ముల్లఁబట్టి నామనము మనమున లేదు. అస్వస్థతఁ జెందియున్నది. ఇది చిరపరిచితముగ నన్నను పోల్పలేకున్నాఁడ. ఇది యెవరిది చెపుమా!

ఆ:- ఉ. శంబరదానవాటవిని సంగరరంగమునందు వీతిహో
త్రింబన మ్రగ్గఁజేసి సమరంబునఁ గైక యొనర్చినట్టిసా
యంబునకై వరంబులఁ గళాభిరతి న్దయచేసి దానమృ
త్యంబకదర్పిష్టుఁడౌ దశరథక్షితిపాలుఁ డితండె పుత్రకా!

భ:- ఆర్యా! ఈప్రతిమాగృహమున మృతనరపాలురప్రతిమలు మాత్రమేకదా యుంచఁబడుట? ప్రస్తుత మేలువారిప్రతిమకూడ నుంచు టాచారముకలదా?

ఆ:- కుమారా! ఇచట మృతనృపాలురవిమాత్రమే యున్నవి.

భ:- ఆర్యా! అయిన సజీవులైన మాతండ్రిగారిప్రతిమ యిచట నేల యుంచబడినది?

ఆ:- (స్వగతము) వశిష్ఠసుమంత్రాదు లీచావువార్త నామూలమున నీయువరాజునకుఁ దెలుపఁదలంచికాఁబోలు మాతులగృహమున నున్నవాని కిది తెలియకుండ మఱుఁగుపఱచి యాత్రోపసీరథముఁ దెప్పించిరి. నా కిది తప్పనిదే. (ప్రకాశముగా)

చ. ఒకనిముసంబు రాము విగనోర్వనిభర్తను జేరి రాముఁ గా
నకు, భరతు న్నృపాలుగ నొనర్చుటయే వరమంచుఁ గోరి య
య్యకుటిలు, సత్యధుర్యు మృతినందఁగఁజేసె..........

శ:- (విభ్రాంతితో నతికోపితుడై) అట్టికట్టడికార్యముసల్పినముద్రిక్కడి
రక్కసి యెవ్వతె ? నాయన్నను, సంతతసత్యసంధుని, జగదానంద
కరుని, నతజలోచనచకోరీచంద్రుని, త్రిజగజ్జైత్రుని, అసహాయ
శూరుని, మేరుధీరుని, రాజ్యేందిరాసమ్మానార్హభుజపీఠుని, నాసర్వ
స్వమును, నాశ్రీరాముని, కానలపాలుచేసి, శోభాహీనమై,
యమంగళాకరమై, యనాథమై, దుఃఖాకీర్ణమై, శోచ్యావరావ
తారమై యాత్మవిహీనమైనకళేబరతుల్యగా నీయయోధ్యను
జేసినపరమద్రోహి యెవ్వతెయో వక్కాణింపుము.

ఆ:- ... ... ... ... త్వదీయమాతృకై
క కరుణమాలి... ... ... ... ... ...

భ:- (మూర్ఛిల్లి యార్యుఁడు సేదఁదేర్ప లేచి) (స్వగతము) అన్నా
నే జనించినకతమున రాజ్యార్హుఁడవౌ నీ కాటవికజనార్హ మగ
కాంతారవాసక్లేశ మేర్పడినదికదా ? అక్కటా ! ఇఁక నాగతి
యేమి ? నే నెట్టికట్టడికడుపునఁ బుట్టితిని ?

సీ. కన్నజననికంటె కడుప్రేమ ననుఁగాంచు
కౌసల్య నేగతిఁ గాంచువాఁడ ?
తనసుతులను మించి దయఁగాంచెడిసుమిత్ర
కనలినమో మెట్లు గాంచువాఁడ ?
రాముని వెన్క శ్రీరాముఁడవే యను
గురువర్యు నేరీతి దరియువాఁడ ?
మాహితంబే కోరుమంత్రివర్గంబును
సిగ్గేది యేవిధిఁ జేరువాఁడ ?
గీ. రామచంద్రుని ప్రభువుగ రహిఁదలంచు
జనుల నేచిక్కి చూడఁగ జాలువాఁడ ?
దుష్టబుద్ధి, కుతంత్రియు, ద్రోహకారి
కైక కడుపునఁ బుట్టినకారణమున.

ఏమనుకొనిన నేమిసార్థకము ? విధి యిట్లున్నది కాబోలు
ఆర్యా మీ నుడువునది సొంతముచేయలేదే ? ననేమయుగా వదల

తిరేమి ? మాతల్లి (పెదవికొరుకుకొని) తల్లికాదు మావంశము పాలిటి క్రూరభుజంగము నాకెక్కడ దాపరించినది ? (ఇంచుక స్వస్థుఁడై) 'కరుణమాలి'యనియాపితిరే ముగింపుఁడు.

ఆః_ ... ... ... ...

లేఁడు మృతిఁగాంచెను రాముఁడు కానకేఁగుడుఁ.

(అతి దుఃఖమున) హా ! తండ్రీ ! ఈరాక్షసీగర్భమున నేను జనింపకుండిన నింక కొంతకాలము మని సర్వసర్వంసహాచక్రము భరించుచుండియుందువుకదా ? ఈనీచునివలన గదా యిందరి కిన్ని యిక్కట్లు సంభవించినవి ? ఎంతలో నీకు మృత్యు వాసన్నమైనది?

సీ. నరభోక్త శంబరాసురుని యుద్ధంబున

 • ద్రుక్కుఁగాఁ జేసిన శూరవరుఁడు

అరువదివేలేండ్లు ధర నొక్కఛత్రంబు

 క్రింద నేలినరాట్పురందరుండు

సప్తాంబుధులను రాజ్యవుటెల్ల లోనరించి

 యొకరథంబునఁ బారుపఁ్రకటబలుఁడు

తనమాటకై కూర్మితనయు రాముని కాన

 కంపిన నిత్యసత్యవ్రతుండు

గీ. యోధుల కసాధ్యమైనయ యోధ్య వీడి

కన్నసుతులను రాజ్యభోగముల విడిచి

నన్నుఁబోలునిర్భాగ్యునిఁ గన్నకతనఁ

బుత్రశోకంబు తోడురాఁ బోతె దివికి ?

ఆర్యా ! మామాత జానకీదేవి పతిఁబాసి యెట్లుసహించు చున్నది ?

ఆః_ కుమారా ! తారావిభునివెంబడి పోవురోహిణిం బోలె జానకీ దేవియు. భ్రాతృవత్సలుఁ డగులక్ష్మణుఁడును శ్రీరాముని వెంబ డించిరి.

భః_ (నివ్వెఱపడి) ఓసీ ! క్రూరరాక్షసీ ! సర్వనాశనకారణ మగు నీ కార్యము సంపూర్ణ ఫలద మైనదని సంతసించితివికదా ? ఏహాహ

మెఱుఁగని నన్నీ జననిందపాలొనర్చుటకు నీకీసకలామంగళ హేతుభూతం బగునాలోచనఁ జెప్పిన దెవరే? (ఒఱమండి ఖడ్గము నుబెఱికి రౌద్రమున) ఇట్టికట్టడికార్య మొనర్చిన దెవ్వరైనను సరియే! యీచంద్రహాసంబున ఖండఖండములుగ ఖండించి నాపెన్నిధానమునకు, నాసోదరవత్సలునికి, నాశ్రీరామున కొనర్పఁ దలఁచినరాజ్యాభిషేక మహాయజ్ఞమునకు భాగమునొసర్చెదను. ఎవఁడు నన్నడ్డగించువాఁడు?

నాప్రభునియెడ ద్రోహమొనర్చినవారు నాకు ద్రోహమొనర్చినవారు కారా? వారల నే నెట్లు సహింపవలయును?

సీ. నామూలమునఁగదా నయమార్గగామిని
కౌసల్య పుత్త్రశోకమునఁ గుందు?
నామూలమునఁగదా ననుఁ బ్రేమఁగనుసుమి
త్రామాత సుతుఁబాసి తల్లడిల్లు?
నామూలమునఁగదా కామితసుతుఁబాసి
తండ్రి పెన్వగను చిత్తమునఁ గుమిలె?
నామూలమునఁగదా సౌమిత్రి పురిఁబాసి
కాననకష్టము ల్గాంచుఁ గినిసి?

గీ. జానకీయుక్తుఁడౌ రామచంద్రమూర్తి
ప్రభువుగాఁ గాంచుకోరెడి ప్రజ తపింప
నిన్నిటికిఁ గారణంబైన యేను కైక
గర్భజలధి విషంబనై కలుగ నేల?

హా! రామచంద్రా!

గీ. తమ్ము లిటు నటు వింజామరమ్ము లిడఁగ
వెలిగొడుగుఁ బట్ట నే, సింహపీఠమునను
గ్రాలుజానకీరాములు కాననమున
నన్ను దూఱుచుగడపుచున్నార లేమొ?

నే జేగొనర్చిన కొలఁది మఱింత ద్రోహినిగ బరిగణింపఁబడు దునని నాయంతరాత్మ యుద్బోధించుచున్నది. దీనికి తత్కామ

ప్రతిక్రియ నూహింపవలయును. ఆర్యా! తత్క్షణమే నామునవిగా బుత్తెంచి వశిష్ఠసుమంత్రాదులను జననులను కౌసల్యాసుమిత్రలను వినయమునను, అరక్కసికైక నవినయంబునను నెల్లరఁ బ్రతినూ గృహమున నిప్పుడే నేఁ జూడఁగోరుచున్నాఁడనని వార్త నంపి వారు వచ్చు నేర్పాటు చేయింపుఁడు.

ఆ:- ఆయుష్మంతుని యాజ్ఞ సత్వరము నెఱవేర్పఁబడును. (నిష్క్రమించి తిరిగి ప్రవేశించి) ఇప్పుడే వార్తావహులఁ బుత్తెంచితిని.

భ:- సరియే. (నిర్వేదముతో) అయ్యో! నాస్థితి దుర్భరము. అవాచ్యము.

ఉ. ఏవిధిఁ బాపుకొందు వచియింపఁగరాని నిరాపనింద ? నిం
కేవిధి మాతృవర్గమున కే నపరాధినిగామిదెల్పు ? దిం
కేవిధి మంత్రికి న్గురుని కిప్పటినా వెత తెల్లడింతు ? (యోచించుచు దుఃఖమగ్నుఁడై మూర్ఛిల్లి యార్యుని శైత్యోపచారములచేఁ దెప్పరిలి) యో
దేవ! మహానుభావ! వెతదీఱుట యెట్లులు? భ్రాతృవత్సలా!

అన్నా! రామచంద్రా! సర్వజ్ఞుఁడ వగు నీయొద్ద నేనేమి దాఁపఁగలను? నే నెన్నఁడు నీరాజ్యం బాసించియుంటినని విషయము నీకుఁ దెలియదా? తండ్రిచాటుపిల్లలవలె నీయండ సురక్షితముగ నుండ వేడ్కలకు మ్రొక్కుదు. అట్టినేనా నీరాజ్యంబున కాసించుట? నే నేబాసఁజేయుమనినఁ జేయసంసిద్ధుఁడనై యున్నాఁడ. నా కీయపవాదసముద్రముఁ దరింప త్రోవ యనునావఁ జూపి దరిఁ జేర్పుము. పతితపావనా! నీ యీబిరుదంబు సార్థకపరచుకొనుట కిదియే యదను. (ఉన్మత్తునివలె నటించుచు) రామా! రామా! వచ్చితివా? మార్గదర్శకుఁడ వగుదువా? పరమసంతోషము. ఇప్పటి కీగండము గడచును. (వినట నభినయించి) ఏమనుచున్నావు? కౌసల్యాసుమిత్రామాతల యెదుట కైకను 'ఎన్నడైన నాకు రాజ్యము కావలయునని కోరితినా' యని గద్దించి యడిగి పితృఘాతముపాల్క బాసఁజేసిన వారియనుమానము దీఱునని యా

యుపదేశించుచున్నావు! హా కరుణగలతండ్రీ! కన్నతండ్రీ! ఇట్టి కరుణార్ద్ర హృదయుఁడవగు నీకెన్ని బాధలఁ గూర్చితిని! నాజన్మమునకు సార్థక్య మిదియా! (మూర్ఛిల్లి తిరిగిలేచి) తమ్ముఁడా! లక్ష్మణా! ఏల యింతక్రూరముగాఁ జూచెదవు? నాయనా! నా యంతరాత్మ నీకుఁ దెలియదా? నేఁగూడ కైకతోడఁ జేరిన ద్రోహినని కూ నీయూహ? కాదు. కాదు. నిజమారయుము. రామనృపజనకునియొద్ద నను కరుణఁజూడఁ బురుషకారముఁ జేయుము.

గీ. భాగ్యశాలివి తమ్ముఁడా! పసితనంబు
నుండి రామలక్ష్మణు లొకదండ నుంటిరి
కష్టకాలాన మావలెఁగాక యన్న
సేవఁ జేయుభాగ్యముకూడ చెందె నిన్నె.

(వార్తావహుఁడు ప్రవేశించును.)

వా:- రాజపుత్రుల కభివాదనములు.

భ:- వార్తావహా! వారేరి?

వా:- ప్రభూ! మీయాజ్ఞానుసారము తల్లు లిరువురు దుఃఖించుచు నిదిగో వచ్చుచున్నామని యిట్లనుకొనిరి.

సీ. ధవుఁడు పరలోకగతుఁ డయ్యె తనయులనిన
కానయం దుంట పురమునందేని లేరు
భరతుఁ డవమతిఁ గాంచునో? బమ్మ నొసట
యేవిధి లిఖించెనో దాట నెవరివశము?

భ:- అబ్బా! దుర్భరము. దుర్భరము. ఈరాక్షసి కైకకు జన్మించుటఁ బట్టి నాయశఃకాంత యెంతకళంకిత యైనది? దానినిష్కళంక నొనర్చుకొన యత్నించెద.

వా:- ప్రభూ! వశిష్ఠసుమంత్రాదులు వారి ననుసరించుచున్నారు. కైకాదేవిగారుమాత్ర మంతయవసరమే మనుచు తమ నచ్చటికి రమ్మని కోరినారు.

భ:- (దురాగ్రహమున) ఓసిదృఢకలుషా ! ఎంతటిరాగవే ! ఇప్పటికి నానెత్తినఁబెట్టినపాపభారము చాలక మఱియు నెగనెంచితివా ? ఇఁక నీకుఁ జిక్కువాఁడను గాను. రామచంద్రా ! నీయుపదేశమే తదేకశరణ్యము. వార్తావహా ! తనను నే నొంటరిగఁ జూడనొల్లననియు కౌసల్యాసుమిత్రాదేవులు ప్రతిమాగృహముఁ జేరునప్పుటికి తాఁగూడ రావలసినదనియు నిది శ్రీరామభక్తుఁడును ప్రతినిధియునగు భరతునాజ్ఞ యని చెప్పి సత్వరము పిలుచుకొనిరమ్ము. జాగ్రత.

వా:- ప్రభూ ! చిత్తము. (నిష్క్రమించును)

భ:- నారాక యెఱిగింప ముందే పురప్రవేశమొనర్చిన శత్రుఘ్నుఁడింకను రాకున్నాఁడు.

( తెరలో )

తల్లీ ! కైకా ! చచ్చితి. చచ్చితి. నన్నీశత్రుఘ్నకుమారుఁడు చిత్రవధఁగావించుచున్నాఁడు. శరణు శరణు.

భ:- ఏమాకలకలము! (పరికించి) శత్రుఘ్నుఁడు మంథరకేశబంధము నొడిసిపట్టుకొని లాగుకొనివచ్చుచున్నాఁడు. స్త్రీకదా వారించెద. (శత్రుఘ్నుఁడు ప్రవేశించును)

శ:- (మంథరకబరీకర్షణ మొనర్చుచు) అన్నా ! ఈమహాశోచనీయ కార్యమునకు మూలకంద మిది. దీనిఁ జిత్రవధగావించినను స్త్రీహత్యాదోషము పొసఁగదు.

భ:- తమ్ముఁడా ! శాంతింపుమోయీ ! విమర్శనమున శిక్షార్హమైన నట్లె యొనర్చెదము.

శ:- పరమపాపీ ! నిను రక్షింపఁగలప్రభుఁ డార్యపుత్రుఁ డిదుగో ; కైకాదేవి కాదు. శరణు వేఁడుము.

మం:- భరతరాజేంద్రా ! శరణు, శరణు, (భరతునికాళ్ళపైఁబడ శత్రుఘ్నుఁడు వదలును)

మ. అపరాధంబొనరించి నేరనని దైన్యంబంది "మాం పాహి" యం
చు పదంబంటుచు మ్రొక్కు వైరినయిన న్యూరుండు శిక్షించునే ?
విపరీతంబుకదా యటుల్లనలుపుచో ! వీరుండు రాముం డిక
స్వరూపమై చూచున తమ్ములైనమన మీరీతి ప్రవర్తించిరా ?

శ:- అగ్రజా ! క్షమింపుము.

భ:- మంథరా ! నీవెగ్గు దలంచినయా రామచంద్రుని శరణాగతరక్షణ
గుణమే నీ కిప్పటున శరణ్యమై రక్షించినది.

మం:- చిత్రం బాబూ !

భ:- ఈయకార్యమున నీయొనర్చినయపరాధము సమూల మసత్యము
లేక చెప్పిన నీరామానుజుఁడు నిన్ను క్షమించును.

మం:- ప్రభూ ! సత్యప్రమాణముగాఁ జెప్పుచున్నదాన. రామపట్టాభి
షేకము మఱునటిదిన మనగా నే పురిలోనికి వచ్చునెడ పురియెల్ల
శృంగారింపబడియుండుటఁ జూచి దానికత మెఱుఁగఁ గుతూహల
మున నుండ కౌసల్యాదేవిగారిదాసి మంజరిక కనఁబడి రేపు శ్రీరామ
పట్టాభిషేకమని చెప్పినది. నే మొట్టమొదట సంతసించితిని. అదే
మోకాని ప్రభూ ! అంతలో నామనస్సు తిరిగిపోయి రామునిపై
నసూయ వొడమినది. తాము ప్రభువులైన బాగుండునని తోఁచి
నది. ఈసంగతి కైకాదేవిగారికి చెప్పితిని. ఆమెయు మొదట
నాశుభవార్త కలరి నాకు బహుమానముకూడ చేసినది. అవల
సపత్నీశ్రీయోఽసహిష్ణుత్వమున తిరిగి నాదారిఁద్రొక్కినది.
శేషము దేవరకు విదితమేకదా ? ఇది నేనొనర్చినతప్పు. క్షమింప
వేఁడుచున్నదానను.

భ:- (అధికశ్లోకమున)

సీ. కైకహృత్సరోవరమునఁ గాంతిమించు
రామచంద్రవాత్సల్యనీరజముఁ బట్టి
సామజమురీతిఁ బుణికినచాన వయ్యెఁ

వా:- (వార్తావహుఁడు ప్రవేశించును) మహాప్రభూ ! వశిష్ఠసుమం త్రాదులు తోడురా కౌసల్యాసుమిత్రలు వచ్చుచున్నారు.
(నిష్క్రమించును)

భ:- సరియే. మాతల్లి ఛీ ! తల్లియనుపదంబునఁ బిలువఁబడుటకుఁ గూడ ననర్హురాలు కైకకూడ వచ్చుచున్నదా ?

ఆ:- (పరికించి) ఇంతవఱకు రాలేదు.

భ:- ఏలవచ్చును ? రాకుండుటయు నొకందు లకు మంచిదే.

గీ. కైక మున్ముందు వచ్చినఁ గాంచువార
లామెనడువడి భరతున కభిమతంబె
యగుట, వచ్చెను మున్ముందె యనెడివాదు
తప్పె దుఃఖంబులోన మోద మిది కొంత.

ఆ:- (నిష్క్రమించి తిరిగి ప్రవేశించి) ఆయుష్మంతుఁడా ! వారలు హాజారము సమీపించుచున్నారు

భ:- ఆర్యా ! నీ నిదే యెదురేగుచున్నాను. (ముందునకు నడువఁగా నెదురుగా వశిష్ఠసుమంత్రులు కౌసల్యాయుక్తులై ప్రవేశింతురు. (దుఃఖముతో)

మ. కరుణాహీనమనంబున న్విభుని సంకల్పంబుఁ గాదంచు ని
ష్ఠురమౌకోర్కెలఁగోరి భూధవుని విదూరంబునం బంపి, భా
స్కరవంశాంబుధిబాడబాగ్ని యగుకైకాదేవికి న్సుతుఁడౌ
న్భరతుండ న్ప్రణమిల్లుచుంటిఁ గృప శాపంబిచ్చి రక్షింపరే.

వ:- నృపపుత్రా ! భరతా ! చిరంజీవ అభ్యుదయోస్తు.

భ:- గీ. ధవునిఁ బాసియు సుతులు కాంతారసీమఁ
బట్టఁ గార్శ్యంబునను కుందువారి మిమ్ము
నెటుల కాంతునా యనుచు నే నేడ్చుచుండఁ
బోటుమాటలచే గాయముల నొనర్త్రు ?

వ:- వాంఛితార్థఫలసిద్ధి రస్తు.

భ:- ఇప్పటికి నేఁ గొంతవఱకు ధన్యుఁడ తల్లులారా ! ఎట్టిదురవస్థలో మిమ్ములఁ జూడవలసివచ్చె ?

గీ. రాజ్యలక్ష్మి యనఁజగాఁగ రాజకాంతి
వెలయుమీముఖబింబము లెల్లఁబారె
నాథుఁ బాసినసాకేతనగరమట్లు !
విధికృతము మేరదాఁట నవ్విధికిఁ దరమె ?

అమ్మా కౌసల్యాదేవీ ! తల్లీ ! సుమిత్రా ! మీ మొగంబుల నే నేవిధముగాఁ జూతునాయని కుములుచుండ నీదీనుని ప్రేమ రసదృష్టులఁ దేర్పరేమి ? నేఁ గపటిననియా మీయాలోచన ?

గీ. హృదయముఁ గటారిఁ గోసి మీయెదుట నిడుదు
రామభక్త్యమృతమున నార్ద్రంబుగాని
రక్తబిందువు లేదని రామచంద్రు
పాదనీరజములె సాక్షి, భవ్యలారా !

గురువర్యా ! అమాత్యశేఖరా ! పూజ్యజనములారా ! నాని ష్కాలుష్యమును ససాక్షికముగా సనిదర్శనముగాఁ జూపి మిమ్ములఁ దృప్తిపరచెద. నేను నిర్దోషినని మీరు నమ్మినఁగాని నామనస్సంక్షోభము తీఱదు.

గీ. దుర్యశఃపంకిలము, పితృదుఃఖ మనెడి
గ్రీష్మచండాంశుతప్తమై క్రింది కొరిగి
వడినహృచ్ఛాంతిసస్యప్రవర్ధన మగు.
త్వత్కృపారసవృష్టి చైతన్య మిడుత.

వ:- సు:- తథాస్తు.

కౌ. సు:- కుమారా ! భరతా ! నీవింత నొచ్చుకొనవలయునా ? నీబుద్ధి మాకుఁ గొ్రత్తయా !

వ:- వత్సా ! రామానుజా ! నీవు మాకు సాక్ష్యమిప్పించవలయునా ?

భ:- గురువుగారూ ! లోకముకదా ? (వార్తావహుఁడు ప్రవేశించును)

వా:- ప్రభూ ! కైకాదేవిగారు హాజారమున నున్నారు.

భ:- (అగ్రిహామున) అభర్తృహంత్రిని రమ్మనుము. (వార్తావహుఁడు నిష్క్రమించును. కైక ప్రవేశించి మార్గముఁబెట్టి దుఃఖకోపముల నభినయించును.)

కై:- నాయనా! భరతా! ఎప్పుడు వచ్చితివి? తాతయు మేనమామయు తక్కినందరు క్షేమమేనా?

భ:-ఆ నీవంటిభర్తృహంతలు, సర్వనాశకులు లేనందున నయోధ్యవలెఁ గాక యచట నంద రిప్పటికి క్షేమమే.

కై:- నీమొగము. పసివాఁడవు. నాయనా! సంతోషించవలసినకాలమునఁ గోపపడెదవేల?

భ:- అగును. నీకు సంతోషము. నాకంతయు దుఃఖమే.

కై:- నాయనా! నీకు పట్టాభిషేకముఁ జేయనెంతయో యభిలషించి నీరామికి వగచి కాలధర్మముఁ జెందినతేనికై వగవక గురుసమ్మతిని తత్క్షణ మభిషిక్తుఁడవు గమ్ము.

సు:- ప్రభూ! తేఁడు లేనిరాజ్యము విగతధవరీతి శత్రురాజగ్రస్తము కాకుండ రక్షించుభారము ప్రస్తుతము మీామీాదఁబడినదిగదా?

భ:- (కైకదిక్కై) క్రూరరాక్షసీ! అంతటితో నీపంచాంగముఁ గట్టిపెట్టుము. అసత్యప్రలాపీ! తేఁడు నా కభిషేకముఁజేయఁ గుతూహలుఁడయియా మృతిఁజెందెను? నేను సర్వము విచారించి యెఱింగినాఁడ ఇంతకుముందు చేసినదానికి పైపెచ్చుగ నసత్యముల నాడెదవేల? నేనడుగుదానికి మాతృ్రిగారి పాదముల సాక్షిగా నుత్తరమిమ్ము.

ఉ. ఎన్నఁడు రాజ్య మేను వహియించుతలంపున నీవెఱుంగఁగా
విన్న పమాచరించితిని? వీరుఁడు మత్పితృతుల్యుఁ డైనమా
యన్నను, రామచంద్రుని వనాంతరవాసునిఁ జేయుమంటినా?
యన్నరనాథుఁ గాదనుచు హాయిగ రాజ్యముఁజేతునంటినా?

కై:- నాయనా! నీ వంటివని నేఁజెప్పితినా? రాజమాతఁగా నెంచి నీయభ్యుదయము మది నెంచి నేనే యొనర్చితిని. కనుక సత్వరము పట్టాభిషిక్తుఁడ వగుము.

భ:- అయిన నీకోరిక నేఁగోరినది కాదుకదా ?

కై:- ఏలనాయనా ! యట్లు గుచ్చిగుచ్చి యడిగెదవు ?

భ:- ఇంతటనైన నిజముఁజెప్పనియెడల రాజద్రోహివిగా పరిగణింపఁబడి శిక్షింపఁబడుదువు. ఇది రామాజ్ఞ.

కై:- ఇది నీవు కోరినది కాదు.

భ:- (కౌసల్యాసుమిత్రల దిక్కు) తల్లులారా ! వింటిరికదా. ఇది యెల్ల నీమంధరప్రోత్సాహంబున నీభర్తృఘాతకి, పుత్త్రఘాతకి, రాజద్రోహి యొనర్చినపన్నుగడ నాకావంతయుఁ దెలియదు.

గీ. ఇచటఁ బ్రతిమాగృహంబున నీనృపాలు
ప్రతిమఁ గనునంతవఱకు మీపాదమానఁ
బితృమరణమును భ్రాతృవిపినగమనము
నుంతయేని యెఱుంగనుసుమ్ము నిజము.

రాక్షసీ ! ఇన్నిదినంబులనుండియు నామనం బెఱింగినదానవు. నే నీరాజ్యస్వీకారమున కియ్యకొందుననియే తలఁచితివా ? ఇదిగో యొఱిఁగించుమన్న వాఁడ.

గీ. వేయుకపటము ల్పన్నిన విభుఁడు రామ
చంద్రుఁడే, రాజమాత కౌసల్యకాని
రాజమాత కైకేయి భరతుఁడు విభుఁడు
కాదు, కాఁడు ముమ్మాటికిఁ గాదు, కాఁడు.

కై:- నాయనా ! అటులకాదు. నా కీపట్టాభిషేకవృత్తాంతము చిట్ట చివరవఱకు తెలియకుండఁ జేసిరి చూచితివా ?

భ:- గీ. వేయుకపటము ల్పన్నినవిభుఁడు, రామ
చంద్రుఁడే, రాజమాత కౌసల్యకాని
రాజమాత కైకేయి భరతుఁడు విభుఁడు
కాదు, కాఁడు. ముమ్మాటికిఁ గాదు కాఁడు.

ఛీద్రోహీ ! ఇంతమాత్రమునకే నీవు రాజమాతవు నేను రాజునైతి మనుకొంటివా ? నీకాపట్యమున నీ వార్జింపఁగలిగిన దేమిటో గుఱుతింపఁగలిగితివా ?

ఆ. కనినసుతునిప్రేమ, కంటెను మించిన
గారవమున నిన్నుఁ గాంచురాము
నడవి కంపి మూట నట్టకట్టిన విధి,
విధవ వగుట, చెడ్డపేరుఁ గనుట.

ఇఁకనీమొగముఁజూచిన మహాపాపమువాటిల్లును. హామ్మా వలదు.

గీ. మాతృఘాతకుఁ డంచు రామప్రభుండు
మొగముఁ జూడఁడనెడిశంక పొడమువలన
బ్రతికితివిగాని వేఱ యెవ్వండయినను
రామునకు ద్రోహ మొనరించి బ్రదుకఁగలఁడె ?

గురువరా ! సచివశేఖరా !

చ. అడుగిడ నే నయోధ్యను మదగ్రజుఁ డచట లేకయుంటచేఁ
గడువడి రామచంద్రపదకంజముల న్భజియించి, రాజ్యమి
ప్పుడతని కప్పగించెదను. పోయెడియత్నము వేగఁ జేయుఁ డే
గుఁదు, గురువర్యసత్కృపను గూడెడి నిష్టఫలంబు లెల్లెడన్.

వ:- తథాస్తు.

సు:- చిత్తము.

కౌ.సు:- కుమారా ! పోయివచ్చెదము.

భ:- చిత్తము (నమస్కరింగును)

కౌ.సు:- చిరంజీవ. సుఖీభవ. (కౌసల్యాసుమిత్రలు నిష్క్రమింతురు)

కై:- కుమారా ! పోయివచ్చెదను,

భ:- హామ్మ. రాక్షసీ ! (కైక నిర్విణ్ణయగును) సచివా ! కౌసల్యాద్యాదిమాతృవర్గంబునకును, అంతఃపురస్త్రీలకు నాందోళికాది వాహనముల, తదితరుల కుచితవాహనములు సిద్ధపఱచియుంచుము. జనకుని చితివిధి తీఱంగనే పయనము. (సుమంత్రుడు నిష్క్రమించును). గురువర్యా ! నమస్కారము.

వ:- అభ్యుదయోఽస్తు. (కైకతక్క నెల్లరును నిష్క్రమింతురు.)

కై:- (నిర్విణ్ణత్వమునుండి తెప్పరిలి)

గీ. కరగతంబైనరాజ్యంబుఁ గాలఁదన్ని
ధర్మమును గావ రామునితమ్ముఁ డితఁడె
కాన క్షమియింప రాముని గాంచి వేఁడి
కలుషముం బాయుపథమున మెలఁగుదాన.

(యవనిక జారును)

2. స్థలము — గంగాప్రాంతభూమి.

(వృక్షముక్రింద భరతుఁ డుపవిష్టుఁడై యుండును.)

భ:- ఆహా ! విధి దుర్నివార్యము. సకలసౌఖ్యనిధానం బగునయోధ్యలో సింహపీఠి వసించి సకలసామంతుల శాసించుమహాసత్యశూరుఁ డగుమాతండ్రి దివంబున కేగనేల ? సకలరాజ్యభారధూర్వహుండై సార్వభౌమభోగానుభవార్హుం డగునాయగ్రజుఁడు కష్టముల ననుభవించుచు కానలపాలు కానేల ? పోతుటీఁగ దూఱనిహార్హ్యాగ్రములపరిచారికాగణపరివేష్టితయై యుడుగణపరివృతచంద్రబింబముభాతి వెలుఁగుమాజానకీమాత యీవనవాసకష్టంబులనుభవింపనేల ? పట్టణంబును వదలి సకలభోగంబుల వీడి, ప్రియార్ధాంగి యూర్మిళను బాసి తమ్ముఁడు సౌమిత్రి యాటవికునివలె నన్నకు సహాయపడరానేల ? హా ! హతవిధీ ! తామరతంపరలుగ పెఱిగినమారఘువంశోచ్ఛ్రితి నీకన్నుఁగుట్టెనా ? కలకలని నవ్వునింటిని క్షణకాలమున నలబలమున ముంచితివి. ఎంతరాజసుఁడవు !

చ. తలనొకదానిమున్నపుఁడు తాళఫలక్రియ నేలఁగూల్చిన
న్దాలఁగనిరాజసంబున, ననుక్షణము న్ఘోరగాని దేదియో
సలుపుచు, సౌఖ్యమొందెడిప్రజ న్వలవంతలఁ బెట్టునట్టియీ
నలువకు న్యాయముం దెలుపునాయకుఁ డెవ్వఁడు కానరాఁడుగా ?

కట్టడికార్య మొనర్చినప్పుడు కాదని చెప్పువాఁడు లేకుండిన గుణబద్ధులై బ్రహ్మేంద్రాదిదేవతలుకూడ నిరంకుశముగఁ బ్రవ

త్రింతురుకదా ? అజాండంబున నెందరు నృపాలురు లేరు ? దయ్యముకంటికి పేలగింజే వ్రేగనునట్లు రఘుకులాబ్ధిరత్న మగు శ్రీరామచంద్రుడే నీచేతికాటవస్తు వయ్యెనా? అతనిగుణపుంజము సైతము గుణపక్షపాతమున నాతనివైపు వాదించి నీసంకల్పముఁ బూర్వపక్షమొనర్ప నసమర్థ మాయెనా ?

గీ. చెడ్డజంతువులను వీడి శ్రేష్ఠములగు
జంతువులహింసఁ జేయుకసాయిపగిది
తామసగుణప్రధానులౌ ధరణివరుల
వీడి సాత్వికు శ్రీరాము వెతల నిడెదె ?

ఇంతకు నిన్ననవలసిన దేమున్నది ? సామమున గుణము చేక్కబడునా ?

గీ. రాముశాంతినామకసమీరంబు సోఁగి
శరతుషారముఁ గురియులక్ష్మణజలదము
శాంతినొందింప నిలిచె నీజలజపీఠి
యబ్జజా ! యింతగరువంబు నందనేల ?

ఆహా ! విధిదూషణంబున కర్తవ్యమూఢుఁడనైతి. రామాన్వేష ణార్థంబు వచ్చుట. ఆలసింపఁదగదు. అగ్రజుఁ డేమార్గము వనుస రించినది తెలియఁగల్గు నుపాయ మేది ? సుమంత్రా !

(సుమంత్రుఁడు ప్రవేశించును)

సు:- ఆయుష్మంతుఁడా ! రామభక్తాగ్రేసరుఁడును నిషాదపతి యగు గుహుఁడు తమదర్శనార్థమై వేచియున్నాఁడు. అతనికిశీఘ్రమే దర్శనమొసంగుట ప్రస్తుతకార్యసాధకముకూడ నగును.

భ:- అవశ్యము ప్రవేశపెట్టుము. (సుమంత్రుఁడు నిష్క్రమించును) ఈగుహునకు కగ్రజునిపొలకువ బాగుగ తెలిసియుండునా ?

(తెరలో)

తెలియకేమి సుమంతయ్యా ! బాగా తెలుచు.

భ:- ఏమా యుహశ్రుతి! అగ్రజునిపాలకుపవ తెలియునా యనివిచారిం చుచుండ బాగుగా తెలియునని యుపశ్రుతి! అత్యనుకూలము. ఏమి సుమంత్రుఁ డింతజాగుచేయుచున్నాఁడు! జాగుచేయువాఁడు కాఁడే వచ్చుచుండును. (గుహుఁడు ప్రవేశించును)

గు:- (స్వగతము) ఏమి యీబలగం! నేల యీనిన ట్టుండది, బరత య్యాది మంచిగుండై తే యింతసిబ్బం దెందుకు? ఇదేదో యొక మోసమూ, పన్నాగమే. చీరామయ్యను చంపడానికాయని చేం దేయం. అడవుల్లో వుండేవోళ్లకీ మాకున్నూ డా సెప్పకుండా యెకీ కీన యింతమందితో రావటం మంచికి కాదనితోస్తుంది. కుడవ బోతూ కూంరాకునుచపగడ మెందుకు? బరతయ్య ఏరామయ్యకు సెడ్డసెయ్య తలుసుకుంటె గంగ దాటించం. దాటిచ్చా లేఁపు. అల్లా కాకపోయెనా ఆపెబుప్రపాదాలు నెత్తినెట్టుకొని గంగమ్మను నే సొంతంగా దాటిచ్చుడమేకాకుండా నేరుగా చింమయ్యపాదాల కాడికి సేరుత్తా. లేకుంటే మాకులాన్నంతా స [illegible] ఒక్క చెయ్యి సూపిత్తా. కానీ (ప్రకాశముగా) మహాప్పబో! బర తయ్యా! దండాలయ్యాసామీ! దండాలు పెహా! మీకు మాచీరామయ్యకు రవంతైనా బేదంలేదయ్యా! సామీ! ఈరో జున మేము చేస్కిపున్నెం పండి మాకండ్లబడ్డారు మారాజులు.

భ:- గుహా! రామభక్తాగ్రేసరా! నీకు నీవారలకు ననుచరులకెల్ల క్షేమమా?

గు:- మహాప్పబో! మీదయున్ననాళ్లు అంతా చేమమే. రెండో చీరామయ్యవయ్యా!

భ:- నిషాదరాజా! గుహా!

గీ. సర్వసర్వంసహాచక్రసార్వభౌమ
రమణ కర్షుండు దశరథరామునకును
చానటి కైకేయిసుతుఁడు దత్సేవకుండ
నాన్యథరతుండు నీచోళమంబు కాఁడె?

గు:- బరతయ్యా! పెద్దపిన్న లేకాని యిద్దరు దచరదయ్యకొడుకులేకా! పోసీ యేదో తెలేనిమనిసి నన్నా. ఏదో వొరమని సెప్పి కైకమ్మ దచరదయ్యను చీరామయ్యా నడివి కంపి దేవకోర్కి దొరతనమిప్పిస్సింది. ఆయిగా కాలిమీాద కాలేసుకొని అయోద్దెలో పెబుత్తం సేసుకోక ఆకులలాల దింటూ అడవుల్లో దిరిగేచీరామయ్యమీాదికి యీాసైన్నమొకటి సంపకం సేసుకొచ్చావేమయ్యా? ఆమాారాజు నీడకూడ బతకనిచ్చేటట్లుంట్లేదే యీాపన్నాగం.

భ:- (స్వగతము) అబ్బా! నాస్థితి దుర్భరము. అవాచ్యము. అసహ్యము. అడవులఁ దిరుగుమొఱకు వానికున్నధర్మబుద్ధి నాతల్లి (జౌదుఁగఁజచికొని) కాదు- ఆ కైకకు లేకపోయె. ఆరక్కసి పెడత్రోవకదా నన్నిట్టిమోటకులచేసైతము నిందాప్తి నొనర్చినది? ఛీ పాపీ కైకా!

గీ. పుత్రదండని పాయసంబును జనకుఁడు
ధన్యకౌసల్యకును సుమిత్రకు నొసంగి
కైక కీకున్న దినమును కనఁగ తాను
రాముఁ డడవిఁ జేరుగ దుర్దశను చెంది?

ఏమనుకొనిన నేమిగలదు? నేఁజెప్పిన నమ్మువా రెవరు? బీజము ఫలమువలనకదా వేద్యమగును? నే నీసంతాపమున మునింగి ప్రత్యుత్తరమున జొగుసల్పిన నింతకే నాసడవడిఁ గూర్చి సందేహించిన యీగుహునిమానసము మఱింతసంశయాస్పదమగు. (ప్రకాశముగా) భక్తాగ్రేసరా! గుహా! నీ శ్రీరామభక్తి యభివర్ణనీయము. ఏలయన శ్రీరాము నపకారమొనర్త్రు నను తలఁపున వచ్చినాఁడనని సంశయించి ప్రస్తుతరాజపదంబున నున్నన న్నును, నాచేత నున్న నీప్రాణములనైతము లెక్కసేయక నిర్భయముగ, నిశ్శంకముగ ననర్గళముగ నడిగివైచి రామభక్తి వెల్లడించితివి. సోదరా!

చ. పురములయందె రత్నములఁబొందఁగనౌ వనవీధులందు నే
తెరవున సంఘటిల్లును? లభించుట దుర్లభమందు రీవిదుల్

గురుపదభక్తియుక్త ! పురి కూర్చుమను ల్జడముల్గదా ? వనాం
తరములఁజిక్కి జీవనయుతంబులు భక్తమను ల్భవాదృశుల్.

నిషాదావతార మగునీయట్టిపుణ్యపురుష సందర్శనమున ధన్యుండనైతి.

చ. దినమణివంశభూషణుఁడు, దీనజనావనుఁ డంగజాంగజుం
డనుపమసద్గుణాన్వితుఁ, డహర్పతితేజుఁ, డజేయవిక్రముం
డనఘుఁడు, సత్యభాషి యగుసత్క్రుఁడు, రాముని కెగ్గునెంచఁగా
మనుజుఁడఁగాని ? వ్యాధకులమండన ! సంశయమేల నాయెడన్ ?

గీ. రామునకు నెగ్గుఁదలఁచుదుర్మార్గజనుఁడు
గోవధము, శిశుహత్యయుఁ, గోమలాంగి
హననమును, గురుద్రోహమహాఘములను
జేయువాం డ్రొందుదుర్గతిఁ జెందుఁగాక.

గీ. రామభూవిభునెడ నెగ్గుగా మనంబు
నను దలంచిన దశరథమనుజపతి ప
విత్రచరణంబులకుఁ దప్పు నెట్టి నగుదు
గుండెఁగోసి చూపింతు నోగుహా ! వచింపు.

గు:- బరతయ్యా ! చాలసంతోసం నీమెడ నాకు తెల్లమైంది. మహా
ప్రబో ! మిమ్మల్నందరినీ చనం యేనూరు తెప్పలమీద గంగ
కాడటివోళ్లు సేర్పిత్తా. చీరామయ్యుండేపోటు సూపిత్తా. బాబూ!
ముందు నీసైన్నాన్ని సూచి ఆమూరాజును నంపొచ్చావను
కుండానుగాని నీమనసు నాకు తెలిసింది బాబూ !

భ:- రామ. రామ (చెవుల మూసికొనును)

గు:- మహాప్రబులముందు యేదో తెలీక కూశా చెమించాలె.

భ:- గుహా ! రామభక్తాగ్రేసరా ! మాతండ్రి రామచంద్రుఁడును,
మాతల్లి జానకీదేవియు పరుండినపుణ్యస్థలములను జూపి పుణ్యముఁ
గట్టుకొనుము. సుమంత్రా ! వశిష్ఠగురువర్యులను మాజననుల

కౌసల్యాసుమిత్రలను, కైకను తత్క్షణము పిలుచుకొనిరమ్ము (సుమం
త్రుడు ప్రవేశించును.)

సు:- చిత్తము. (నిష్క్రమించి వశిష్ఠ, కౌసల్యా, సుమిత్రా, కైకలతోఁ
బ్రవేశించును.)

భ:- గురువర్యా! తల్లులారా! అన్నగారు, వదినెయు, తమ్ముఁడును
మొదటిరాత్రిఁ గడపినచోటులఁ జూతము రండు.

గు:- (ముందు నడచి) బరతయ్యా! ఈగారసెట్టుకింద పరిసున్న వే
దబ్బలు, ఆడ శీరామయ్య, జానకమ్మగారు ఆ రేయి గడపినసోటు.
ఇఁక లచ్మన్నగతి సెప్పాల్సిందే లేదు కందా! ఈడ ఆమా
రాజ్జుఁగూడ దబ్బలపక్కఁ గొంగాని ఇండ్లంబులబట్టుకొని రెప్ప
కొట్టకుండా రేయంతా పారాయిచ్చాడయ్యా. మొరటోండ్లం
గూడా రేయి రెండుజాము లయ్యేసర్కి సొప్పకట్లలాగా పడి
తొంగున్నాంగాని ఆయనమాత్రం కూరక్కఁ అన్నను, వొదిన్న
తలుసుకొని తలుసుకొని కుమిలికుమిలి యేడ్సాడయ్యా! ఏమిసెప్ప
నాయనదుక్కం?

భ:- (శ్రీరామశయనదర్భలలో పాదములకడ వానిని తీసి కన్నుల
కద్దుకొనుచు) గురువర్యా! తల్లులారా! చూచితిరా?

ఉ. మెత్తనిపట్టుపాన్పుపయి మే నమరించినఁ గందునన్న తా
నొత్తికిలంగ మెత్తపడి యొప్పినచోటిది; పట్టురేణువు
లత్తులఁబోలుదర్భలను ఘర్షణమొందుట రాలియున్నచో
టిత్తలమందు మాత శయనించినచోటని తెల్పు కంటిరే!

హా భ్రాతృవత్సలా! రామచంద్రా?

గీ. నేను వాడముటఁ గష్టము లిన్ని వలచె
నట్టిచోటులఁ గాంచఁగా నగునె వీని
కారణం బగుకైకేయి కనెడిఁగాక
రామ! శ్రీరామ! నన్నెట్టు లోమెదొకొ?

(అని మూర్ఛిల్లును)

గు:- ఆహా! బరతయ్యా! ఈన చీరామయ్యాను సేరనిది బతికేటు లేదు. పొద్దున్నే గంగ దాటేత్త. రే యీమాడండి బాబుల్లాలా మీకు కావలచినన్ని వంపిత్తా.

వ:- గుహా! అటులే యొనర్పుము.

గు:- అయ్యా! బరతయ్యను లేపండయ్యా! నే నిప్పుడే వత్తా. (నిష్క్రమించును.)

కౌ:- (భరతుని సేదఁదేలుచుచుండును)

వ:- కైకాదేవీ! నేజెప్పినది నిజమైనదా?

గీ. భరతుఁ డీరాజ్యమున కాసపడఁ డటంచు
నయభయంబులఁ జెప్పనే? నాతి! నాఁడు!
మోదమున దుఃఖబీజంబు ముందు మిగ్రింగి
తాపమొందఁగలేననఁ దప్పనొక్కొ?

కౌ:- తండ్రీ! వశిష్ఠా! ఎత్తిపొడుపుమాటల కిదియా సమయము? మాయందరికర్మ యిట్లున్నది. కైకేయి యేమిచేయఁగలదు? ఈ కుమారునిఁ దేర్చునుపాయ మాలోచింపుఁడు. (గుహుఁడు ప్రవేశించును.)

గు:- అమ్మా! బరతయ్య కింకా వొళ్ళు తెలేనే లేదటమ్మా?

సు:- లేదు, నాయనా!

వ:- మిన్నకుండుఁడు. నే దేర్చెద. (భరతుని మెల్లగాఁ దట్టిలేపుచు)

గీ. రామసాన్నిధ్యమునకు బిరానఁబోవ
యానపాత్రంబు గురునిచే నమరువఁబడె
లెమ్ము లెమ్ము పరుంటివే సామ్మసిల్లి?
యన్నయెడభక్తి యిట్టిదే యగునో? యేమొ?

భ:- (స్మృతిఁగాంచి కూర్చొనుచు త్వరలో) గురువరా! యానపాత్ర మేది? నే సిద్ధముగ నున్నాఁడ. గుహుఁ డేఁడి?

గు:- బాబూ! ఈడనేయుండా!

భ:- గుహా ! సర్వము సిద్ధము, బయలుదేరుదమా ?

గు:- మారాజులు బొమ్మసిల్లి యిప్పుడే కందా లేసింది ? పులిజున్ను, పుట్టతేన, కావలచినం తింపించా పుచ్చుకొని ఆయిగా తొంగోండి తెల్లవారేసరికి సీరామయ్య పాదాలకాడికి చేరుత్తా.

భ:- గురువరా ! అట్లు చేయుట లెస్సకదా ?

వ:- భరతా ! అటులే కానిమ్ము.

భ:- తల్లులారా ! సుమంత్రా ! భుజించి విశ్రమింపుఁడు. గుహా ! రేపటియుదయమున రామచంద్రదర్శనము చేయింపవలెనుమీ.

గు:- బాబూ ! తప్పక నా సత్తెప్రమాణంగా సేరుస్తా.

భ:- సరియే. (యవనిక జారును)

### 3. స్థలకము - చిత్రకూటపర్వతము.

(శ్రీరామలక్ష్మణు లుందురు.)

ల:- అగ్రజా ! భవదాజ్ఞానుసార మావృక్షాగ్రము నెక్కి చూచితిని. ఆదిశ నిజముగ ధూళిధూసరిత మగుచున్నది.

గీ. గాలివానయు, సుడిగాలిగాని కాన
రాదు, సూర్యోపరాగంబు లేదు నేఁడు
కాంతిమంతుఁడౌ సూర్యుఁడు కళను తొఱఁగె
నేమి కారణమో సుంత యెఱుకపడదు.

(నిదానించి గమనించి) పక్షులరొద యిప్పుడిప్పు డతిశయించుచున్నది. వనవాసులకుఁ బరులదరియుట నెఱింగించున దిదియే కదా ? (మఱింత నిదానించి విని)

క. వనరాశిరావముం బలె
వినవచ్చెడి రొద యదేమొ వీనులకును ద
న్నినదంబు సమీపించెడి
ననఘా ! సైన్యోద్భవం బటంచుఁ దలంతున్.

రా:- తమ్ముఁడా ! సేనయైన నెవరిసేన యైయుండునని తలఁచెదవు ? మనయందలి పుత్రప్రేమమున జనకుఁడేమైన నేతెంచుచున్నాఁడేమో ?

గీ. కాననగునేమొ దశరథక్ష్మాతలేశుఁ
డెల్లవేళల ధరియించు వెల్లగొడుగు ?
కానరాదేని యెవరిదో కనుఁగొననగు
రథముపైఁ గల్గు టెక్కెంపు విధముఁ గాంచి.

ల:- అగ్రజా ! కొంతవఱకు ధూళి తగ్గి వచ్చుబలము తెల్లమగుచున్నది. సమీపించుకొలఁదిని తిరిగి ధూమ్ర మారంభమైనది.

ఉ॥ అల్లదె ధూళిధూసరితమై కనుపట్టెడి దానిలోపల
నెల్లని వాజులయ్యవియె, తేరులవే, మదవారణంబు ల
ల్లలవె, వచ్చు కాల్బల మొత్తూరముగా నదె కాంచఁ గోవిదా
రోల్లసితంబు టెక్కె మదె యొప్పెడి వైరిభయాస్పదాకృతిన్.

కోవిదారకేతనోల్లసితుఁడు భరతుఁడే. మహాబలసమన్వితుఁడై వచ్చుచున్నాఁడు. ఆలోచింప నాలస్యముకూడ లేదు. సైన్యమాదరియుచున్నది. శాంతిగుణోపేతుఁడు కాకుండిన యుద్ధము సిద్ధము. కవచధారణ మొనర్చుఁడు. భూమిజను పర్ణశాలయందుండ నియమింపుఁడు.

మ. తనసామర్థ్యముచేతఁగాక జననీదత్తంబు రాజ్యంబుఁ జే
కొని పాలించుచు సౌఖ్యమొందక యిటు ల్క్రూరాశయంబూని యీ
వ్వనభూమి న్దిరుగాడు దేవరపయి న్వైరంబుసాధించు దు
ర్జను న్గైకేయితనూజు నీక్షణమున న్నాసింతు బాణంబుచేన్.

ఇంచుకయాజ్ఞ నిడి చూడుఁడు.

గీ. ద్రోహుల న్వధించి పరమసంతోషమునను
క్షణములోఁ జిత్రకూటాద్రిసానువులను
రక్తఝరములఁ బాఱించి రామచంద్రు
సన్నిధానమునకు వత్తు సత్వరంబ.

శ్రీ:- తమ్ముఁడా సౌమిత్రీ! నీభక్తికెంతయు సంతసము. నీవంతవాఁడవే. కోవిదారకేతనము వైరిభయాస్పదమేకాని మిత్రసమ్మోదకరము కదా? శాంతింపుము. శాంతింపుము. భరతుఁడు శత్రుత్వము సాధింపనే వచ్చుచున్నాఁడని యెట్లు సిద్ధాంతపరచితివి? అతని యాగమనకారణమునకు రెండుహేతువులు తోఁచెడి.

చ. జనని యొనర్చినట్టిపని స్వాంతము జల్లనిపింపఁగా ననుఁ
జనకజ, నిన్నుఁ గాంచెనొ; మనంబున శోకిలు తల్లిదండ్రిపా
ట్లను తెలుపంగనో యొకో? హుటాహుటి పోనరింప నెంచెగాఁ
జెనటియె? యింతదారుణపుచేతకు నొప్పునొకో యవార్యుఁడై!

నామనముఁ బూర్తముగ నెఱుఁగనివాఁడ వౌటచేతనే యిట్లు పలికితివి.

గీ. నేను రాజ్యంబుఁ దాల్పఁగాఁ బూనుటెల్ల
సానుజము, సజనంబుగ సౌఖ్యమొంద
నెంచియే, తమ్ములం జంపి యేలునట్టి
రాజ్యముంగోనఁ గలవాఁడరా కుమార!

నీత్వరయు, నీకోపముఁబట్టి భరతునికంటె నీకే రాజ్యకాంక్ష కలదేమోయని శంక వొడమెడి.

గీ. అంతరంగంబునం దుండునట్టి కాంక్ష
దాపఁగా నేల నాకడఁ దమ్ముకుఱ్ఱ!
భరతునకుఁ జెప్పి రాజ్య మివ్వంగఁ జేతు
నోకొ? వనవాసకష్టము లొందలేవు.

ల:- (లజ్జాసంకుచితశరీరుఁడై చెంపలు వేసికొనుచు) అన్నా! క్షమింపుము. నాకు రాజ్యకాంక్ష యున్నది లేనిది తమకు వేద్యమే. నేఁజెప్పికొన నేల?

గీ. దేవరకు నవకార మేదేని పొసఁగు
తీరు కనుపట్ట రాజభక్తిగరిమం

మణిభూషణంబులఁ బెనఁగొన్నవతి మేన
నతిమాలలఁ దాల్చె నకట! నేఁడు
సింహపీఠిని వసించెడిధరాతలపతి
దర్భాసనంబునఁ దనరె నేఁడు.

గీ. సకలరాజన్యతారకానికరవేష్టి
తుం డగుసుధాకరుం డనఁ దోఁచుకాంతి
వెలయుశ్రీరామచంద్రుఁ డివిపినవాస
తాపసావృతుఁడై పొడసూపె నేఁడు.

శ్రీ:- తమ్ముఁడా! భరతా! నావేసంబును జూచి దుఃఖంపకుము.
నాయనా! విధి బలీయము. దాని నట్లుండనిమ్ము.

గీ. గురువరుఁడును పురోధయు కూర్మిమీఱ
తొంటివలె నర్చితులరె? మంత్రులును మంత్ర
రక్షణము సేతురే? యసర్గళతఁ బెలఁగు
నైరులు వినమ్రులగుచును వర్తిలుదురె?

క. జనకుఁడు సుఖుఁడే? జనులు
మనముల దుఃఖంబు మాని మనుజాధిపు సే
వన మొనరింతురె! నీ విటు
చనుదెంచు టెఱింగి పితయు స్వాస్థ్యముఁ గనెనే?

భ:- అన్నా! సత్యనిత్యా! గురుమంత్ర్యాదులు యథాపూజితులే.
జనకుఁడు స్వాస్థ్యమే కనెను. జనకతుల్యుల రగుతమపా టెట
లగుట వికలమనస్కుఁడనై మిమ్ము మగుడికొని చన ససైన్య
ముగ వచ్చితిని.

ఉ. ఇంతకుఁ గైకగర్భమున నేమని నే జనియించినానో నే
వంతలఁబొందఁజేసితిని భ్రాతల, స్వర్గముఁజేరఁబంపితిఁ
శాంతియుతు న్పిత, న్నగము చొచ్చియుఁ జావక సిగ్గుమాలి ని
న్గాంచఁగ నిట్లువచ్చితిని కంజహితాన్వయవార్ధిచంద్రమా!

గీ. భ్రాతృ, పితృ, మాతృహననరూపంబుఁ దాల్చి
కైకగర్భాబ్ధిగరళమై క్రాలువీని

కేమిశిక్ష విధించెదో యిపుడె తెలుపు
మిచట శిక్షగాంచినఁ గాంచె నచట వ్యధను.

శ్రీ:- భరతా ! నీవు నిర్దోషివి, నిర్దోషివి, నిర్దోషివి. నాయనా! నీవేమి చేసితివి ? దుఃఖ మనుభవింపవలసినజాతకము మనయెల్లరనొసళ్ళ నేకరీతి వ్రాయఁబడియుండుట నిట్టిది పొసఁగినది.

గీ. వింటివా లక్ష్మణా ! జనవిభుఁడు, జనకుఁ
డమరవిభుఁ జేర నేగినాఁడట కృశించి
నాఁడు సనుఁగని ముద మొందినాఁడు మొదట
చివర మద్వియోగార్తినే చెందె దివము.

కటకటా ! తండ్రీ !

గీ. కాంతలను వీడి, భోగభాగ్యముల విడిచి
రాజ్యముం బాసి స్వర్గసామ్రాజ్యమునను
సఖుని సురరాజుఁ గాంచఁగాఁ జేరుచు నన్ను
నింటికిని బెద్ద నొనరించి యేగినావె ?

ల:- హా ! తండ్రీ ! అసహాయశూరా ! సత్యవాక్పరిపాలకా !

ఉ. నాల్గుపయోధులన్ యనఁగ నల్వురుపుత్రులఁ గాంచినేమి ? నీ
వీల్గెడిపట్ల సేవ నొనరించుట, కిన్ని తిలోదకంబు లీఁ
గల్గిరె చెంతనుండి ? తము గాంచుబుణంబును దీర్చలేనివా
రీల్గినవారె యుండియును, యేమనఁజెల్లు విధాతృకృత్యముల్ ?

భ:- అగ్రజా ! తమ్ముఁడా ! మననల్వురిలోను మీ రిరువు రుత్కృష్ట గుణాన్వితులు. మే మిరువురమే నికృష్టులము. ఏలన.

క. జనకు నియాజ్ఞనె వనికిని
జనుదెంచితి రీరు మాటమనదనంబునకుఁ
జని యూరక గడపితి మట
జనకునిసేవన మొనర్చు సమయంబైనన్.

శ్రీ:- భరతా ! పితృమరణవృత్తాంతము తెలియకుండిన ముందేకదా యట్లొనరించినది ? అజ్ఞాతము దూష్యముకాదుగదా ? ఇచ్చటనే

యుండుము. సౌమిత్రియు నేనును జేని గంగాజలంబుల పితరు
నివాపంబు లిడి యిప్పుడే వచ్చెదము.

భ:- చిత్తము (శ్రీరామలక్ష్మణులు నిష్క్రమింతురు.) ఆహా ! రామ
చంద్రమూర్తి వర్ణనాతీతశాంతమూర్తి. నావేఁడికోలున కియ్య
కొని యయోధ్యైశ్వర్యముఁ జగునా ? (తల పంకించి) అంతరాత్మ
కాదని నుడువుచున్నది. కానిమ్ము. పురుషప్రయత్నలోప ముండఁ
గూడదుకదా ? సామంతులారా ! మీరును రామచంద్రమూర్తికి
విన్నపమొనరించుకొనుఁడు. అందఱ మొక్కపెట్టున నాతనిహృద
యము కరగింపఁ బ్రయత్నింతము. (జానకి యొక్కవైపునుండి ప్రవే
శించును.)

భ:- (కన్నీటితో) జననీ ! నమస్కారము.

జా:- వత్సా ! ఆయుష్మాన్ భవ (వశిష్ఠ, సామంత, కౌసల్యా, కైకా,
సుమిత్రా, సుమంత్ర, గుహులు ప్రవేశింతురు.)

జా:- గురువరా ! నమస్కారములు. గుహా ! ఎల్లరు క్షేమమా ?

వ:- జానకమ్మతల్లీ ! సేమమే.

జా:- అత్తలారా ! నమస్కారములు.

కౌ.సు.కై:- దీర్ఘసుమంగలీ భవ.

జా:- అత్తలారా !

గీ. సుతులు కానలపాలౌట శోకమొకరు
మిమ్ము వైధవ్యదుఃఖము మేరలేని
జలధి ముంచెను, మిముఁ గాంచి సాశ్రునయన
గాని యేకృశోదరిగాని కలుగ దవని.

కౌ:- పరమపూతా ! జానకీ ! (కవుంగిలించుకొని)

గీ. తల్లి నీవంటికోడలు తనరుకతన
రవికులంబు పూజ్యంబయి రమణ మించు

సు:- నలువ నీరూపగుణముల చెలువమునకు
సుఖముఁ గూర్పఁడాయెను రాజసుందు కాఁడె ?

కై:- తల్లీ! సీతా! నాతప్పు క్షమింపుము.

గీ. విధివశంబున రాజ్ఞనై వెలయు టుడిగి
వనమునం దున్న విసయము, భర్తృభక్తి
సౌమ్ములను మించె. పరమవిశుద్ధచరిత
వట్టినినుఁ గాంచి ధన్యుల మైతి మమ్మ.

జా:- అత్తలారా! మీయాశీర్వచనమాహాత్మ్యమున నభివృద్ధిఁగాంచునే నాజ్ఞాస్థానుగాని ప్రశంసార్హను గానుగదా? అదుగో సౌమిత్రి ద్వితీయులై యార్యపుత్రులు వచ్చుచున్నారు. (శ్రీరామలక్ష్మణులు ప్రవేశింతురు.)

శ్రీ:- గీ. అంత్యకాలంబునందు పితృప్రభృతియుగళి
సన్నిధానంబునం దుండి జలము నీక
నేఁడు గాంగా బున్రలచేత నీకు సలిల
తర్పణ మొసంగుటిమి తృప్తి దానఁగనుమ.

శ్రీ.ల:- గురువర్యా! నమస్కారములు. ఆకుశాస్త్రరణములు మీచే నలంకరింపఁబడుఁగాక.

వ:- ఆయుష్మాన్ భవ.

శ్రీ:- గుహా! క్షేమమా?

గు:- సిత్తం. మహాప్రభో!

శ్రీ:- సామంత సుమంత్రులారా! క్షేమమా?

సా:- సు:- మహాప్రభూ! చిత్తము.

శ్రీ:- అకటా! తల్లులారా! మిమ్మోటిసితిలోఁ జూడనయ్యెను?

క. సారసహంతుఁ బాసినయా
నీరజముఖులవిధిఁ బాసెనే కాంతి మిముఁ!
భూరమణుఁడు దివి కేఁగఁగ
ఘోరార్తియుతం బయోధ్యకు న్సవతులనన్.

అమ్మలారా! తమ్ముఁ డేడి?

కౌ:- తండ్రీ! వచ్చుచున్నాఁడు. నీకాననగమనానంతరమునను, మీ జనకునిస్వర్గగమనానంతరమున నయోధ్య మఱింత చెన్నుఁదఱిఁగి యున్నది సుమా. ఈభరతునిమొగముఁ జూడుము. ఈసామంతునియాననముఁ దిలకింపుము. ఈగురువర్యుల యాస్యం బవలోకింపుము. వేయేల సకలపరివారంబును విలోకింపుము. అయోధ్య గతి నేఁ జెప్పకయే వేనోళ్ల చాటఁబడుచున్నది. (శత్రుఘ్నుఁడు ప్రవేశించును.)

శ:- అగ్రజులకు నమస్కారములు (కన్నీరు నించును)

శ్రీ:- (శత్రుఘ్నుని గవుంగిలించుకొని) పిన్నతమ్ముఁడా! శత్రుఘ్నా! తండ్రిలేనివాఁడవైతివా నాయనా! ధాతలిపి యనివార్యముకదా! శోకించు టుడుగుము.

సుమి:- నాయనా! రామచంద్రా! ఈశత్రుఘ్నకుమారుని జూచితివా? వేఱుగాఁ జెప్పనేల? అయోధ్యానగరమంతయు నీవియోగదుఃఖాబ్ధిమగ్నమై యున్నది. నీవు కర్ణధారుఁడవై యొక యొడ్డుఁ జేర్పకుండినఁ గడతేరునుపాయమే లేదు.

కై:- రామచంద్రా! నాయపరాధంబు సైరించి తమ్మునిముద్దును, అయోధ్యాభిమతమును తీర్పుము. (జాబాలి ప్రవేశించును)

శ్రీ:- సంయమీంద్రా! నమస్కారములు. ఆయాసనమున నుప విష్టులు గండు.

జాబా:- చిరాయుష్మాన్ భవ. (ఆసనమునఁ గూర్చుండును)

శ్రీ:- తండ్రీ! భరతా! తండ్రి గతించినమీఁద నరాజకమగుట రాజ్యము పరరాజహస్తగతంబు కాకుండ భరింపవలసినవాఁడ విట్లు రానేల ?

భ:- అన్నా! ధర్మవత్సలా!

గీ. కామినీలోలుఁ డగుచుఁ గైక కిడినట్టి
వరములం జిక్కి, ధర్మంబు తరల జ్యేష్ఠుఁ

గాదనుచు విన్నను ప్రభువుగా నొనర్చి
పాప మొనరించె పిత, దిద్దఁ బాడికాదె ?

క. అన్నవు కానలఁ దిరుగఁగ
చిన్నతనము వీడి నీదుసింహాసన మే
తెన్నున నెక్కఁగ నేర్చెద
నన్నా ! రాజ్యంబుఁ బూను మన్నా ! దయతోఁ.

ఉ. కట్టనిరాజ్యకాంక్షఁ గొని, కానివరంబులఁ గోరి మి మ్మిటు
ల్గుట్టలఁ బట్టఁజేసి, వెతఁగూర్చి ధవు న్మరణింపఁజేసె నా
రట్టడికైక, యామెనుడి రాజ్యముఁ బూనెడియంత వెఱ్ఱినా ?
పట్టితి నీదుపాదములఁ బాపము వాపి యనుగ్రహింపుమీ.

గీ. తమ్ము లిరువంక వింజామరమ్ము లిడఁగ
వెల్లగొడు గేను దాల్ప ఠీవిగను సకల
రాజరాజి కొలువఁగ గారవము మీఱ
నిన్నయోధ్య నాధునిగ మన్నించు నన్న!

జాబా:- రఘువీరా! రామచంద్రా! చేపడినరాజ్యము ధర్మబద్ధుఁడై నీ
కప్పగించుచున్న భరతునివాక్యము లాదరింతువుగాక. కొంచెము
తత్వ మాలోచింపుము.

క. కనులయెదుట భస్మంబౌ
తనువున, కానంగరానిధర్మార్థంబై
దనుజానిగతిఁ దపియింపం
జనునే ? యిం తెఱుఁగవొకో ? సర్వజ్ఞుఁడవై.

క. జననం బందెడియపుడు మ
రణముం గనుపట్ల నొకఁడె ప్రాణి యగుట నీ
జననీజనకుల, కర్మల
మనములఁ దలపోసి, శ్రమల మ్రగ్గఁగ నేలా ?

క. జనకుఁడు దివమున కేగెను
జనకునిమా టేమిలెక్క ? సవినయుఁడై, నీ

జనపతిఁ గమ్మని వేఁడెడి
యనుజుని మన్నించి యేల నరుగుము పురికిన్.

క. భగవంతుఁ డెవ్వఁడు ? మఱి యా
నిగమంబులు, ధర్మములును, నిష్ఠ లవేలా ?
జగదానందముఁ గూర్పుము
జగదవనము సలిపి రామచంద్రమహీశా !

శ్రీ:- ఆర్యా ! తమమత మన్వాదిశాస్త్రప్రతిపాదకమైనను ధర్మవిరుద్ధంబై లోకగర్హ్యంబగుట ఆస్తికుఁడ నగునాబోటి సత్క్షత్రియున కపథ్యంబని తోఁచెడిని.

మ. కుజను ల్సజ్జనులట్లు, నాస్తికులు భక్తుల్వోలె, యాశ్వేతర ప్రజలెల్ల స్వరమార్యులో యనఁగ, కర్మభ్రష్టులే కర్మఠ ప్రజమై తోఁపఁగ, ధర్మసత్వములు నిల్పన్నాన్యుఁడో రాజె యక్షజమై తోఁప సధర్మమార్గచరుఁడై కాలంగ వేఱున్నదే ?

గీ. రాజెనుష్ఠించి ధర్మంబు ప్రజల కిట్టి
శాసనంబులఁ గూర్పఁగ జేయను, జనకు
వాక్యము స్మృతి పురి కేను వచ్చునెడల
ధర్మ మెవ్విధి శాసింపఁదరము నాకు ?

ఉ. బాపఁడవౌట నేమనఁగవచ్చును నాస్తికవాది నిన్ను ? నీ
పాపము రాజ్యమందు నినువంటిమహాత్ముల నుండనిచ్చె నా
భూపుఁడు మాదుతండ్రిదిగ ! పూజ్యుఁడ నే సయిరింపఁబోల, నే
నీపని కిచ్చగింపఁ జనుఁ డేఁ గననొల్లను ధర్మపాతమున్.

జాబా:- సత్క్షత్రియశిరోభూషణమా ! ధర్మప్రతిష్ఠాపనాచార్యా ! శాంతింపుము. శాంతింపుము. ధర్మభ్రంశకారణమగు నరాజకమునకు వెఱచి భరతుని వేఁడికోలునకు తమ నియ్యకొనఁజేయ, దీనిచే రాజ్యము గ్రహింపఁబడునట్లొనరింపఁ దాత్కాలికముగ నేఁ జేసిన యుక్తివాదమే కాని ముమ్మాటికి నే నాస్తికుఁడను కాను. ప్రభువు కట్టెదుట నిట్టియవైదికవాద మొనర్చినందులకు క్షమింప వేఁడుచున్నాఁడ.

శ్రీ:- (ఇంచుక వ్రినమ్రుఁడై)

ఆ. రాజ్య మూడుగా, నరాజక మగుఁగాక
హాస్యమైన, స్వప్నమంనునైన
వేదబాహ్యమైనవిధము నెన్నటికేని
నైప, నైప, నైప సంయమీంద్ర !

జా-బా:- ధర్మస్వరూపుండవు, సర్వజ్ఞుఁడవు నగునీనుకేమున కెదురు
న్నదా? ఆజ్ఞ యిమ్ముఁడు. నేఁ బోయివచ్చెద.

శ్రీ:- ఆర్యా ! చిత్తము. (నమస్కరించును)

జా-బా:- చిరంజీవ. (నిష్క్రమించును)

భ:- (స్వగతము) అన్నయానసమం దించుకయు మార్పు కానరాదు.
నా వేఁడికోలున కియ్యకొనునటుల కాన్పించుట లేదు.

సా:- ప్రభూ ! పలినవారు పట్టాభిషిక్తులగుదురని పుట్టెఁడాసతో నుండ
పిట్టపిడుగువంటి యీవిపత్తు సంభవించె. ఆర్యోత్తముఁ డగుభర
తుఁడు రాజ్యము స్వీకరింపుఁడని యింతగాఁ బ్రార్థింపుచుండ
నిరాకరించుట తమబోంట్లకుఁ దగునా ?

భ:- గురువరా ! తూష్ణీంభావము వహించెదరేల ?

వ:- వత్సా ! శ్రీరామా ! సకలరాజ్యము నిన్ను ప్రభువుగ వరించు
చుండ క్షత్రియధర్మముఁ ద్రోసిపుచ్చి వానప్రస్థమొనర్చుట నీ
యట్టిసత్క్షత్రియునకుఁ దగునా ? సాకేతపరిపాలనభారమును
బూనుము.

శ్రీ:- గురువరా !

క. తనువు నిడి తన్నుఁ దా కా
పానరించుకొనంగలేక యుండినతఱిఁ బ్రో
చినతల్లి దండ్రియే గురు
వును మింతురు వారియాజ్ఞఁ బోలునె దాటన్ ?

సామంతా !

ఆ. దశరథుండు ప్రభువు తండ్రి యాశతమున
నతనిమాట దాటు టర్హమగునె ?
వారియిచ్చఁ దీర్పవలదె యెల్లరకును ?
కాన మనకు ప్రభువెకా భరతుఁడు ?

కావున సీతనినువారాజుగారివలె సేవించి ధన్యులు గండు.
అనుజా ! భరతా ! నామాటకు సవిమర్శకంబుగ నాలకింపుము.

గీ. సార్వభౌముఁడౌ సుతుఁ గనఁజనును కైక
యనుచు మీతాత కోరగా జనకుఁ డొప్పె
నందుచే, నీజనని వర మందియుంట
నిన్న యోధ్య నాథునిగ మన్నించె తండ్రి !

అదియునుంగాక నీయిష్టమే తీర్చుదమనిన జనదూషణ
మున్నుండ మూడుపాపంబు లాపాదించెడిని.

గీ. తండ్రియాజ్ఞను మీఱెడిత ప్పొకండు,
తల్లికోర్కెఁ దీర్తు ననినత ప్పొకండు,
తమ్మునికి బాధ్యమైనరాజ్యమ్ముఁ గొనుట
యొండు, యిమ్మూఁడుదోసము లొందు నన్ను.

కాన జనకాజ్ఞ మీఱఁ రా వలనుపడదు.

భ:- సుమంత్రా ! (సుమంత్రుఁడు ప్రవేశించును)

సు:- ప్రభువులకు నమస్కారములు. ఏమి సెలవు ?

భ:- ఎంతచెప్పిన నన్న గారిమనము కరుగకున్నది. నేఁగూడ నిటనే
యుండ నిశ్చయించితిని.

శ్రీ:- నాయనా ! భరతా ! అది యెట్లు ?

గీ. మనకు తండ్రి భాగంబు లమర్చె మున్నె
నాకు వనసీమ, రాజ్యంబు నీ కటంచు
నవరిభాగంబు వారి పేరలమిఁ గొనుచు
జనకు సత్యభాషణునిగ సలుపవలదె ?

మఱియొకటి

సీ. రాజ్యాశచే మహారాజువాక్యంబు ల
సత్యంబు లొనరింపఁజేసునె ? చెపుమ
తండ్రిమాటను మీఱి దాశరథులె యథే
చ్ఛ చరించిరనుట యశంబె ? చెపుమ
అస్థిరభోగాల కాశఁజెందుచు స్థిరం
బగుకీర్తి మాయింపనగునె ? చెపుమ
తనయుండు ప్రభువౌను కనెద ననెడికైక
సంతసం బూడ్వంగఁజేసునె ? చెపుమ
గీ. నడవడియె కీర్తిదంబయి యిడెడిసుఖము
పదియునాల్గేండ్లు స్థిరులకల్పంబు కాదె ?
సమయమును దీర్చి ప్రాజ్యరాజ్యంబుఁ గొందు
నంతమట్టున జనకాజ్ఞ సాంతమగుడు.

భ:- అన్నా ! నన్నిట్లాశ్వాసించుట కన్నీరుఁదుడుచుటకు కాదుగదా!

శ్రీ:- నాయనా ! కాదు. కాదు. సత్యము.

భ:- అగ్రజా ! నామనోనిశ్చయము వినుఁడు.

గీ. పదియునాల్గేండ్లు నిశిగ నెప్పగిదొ తోత్రు
రామభానూదయంబును ప్రేమఁ గోరి
నాఁడు దుర్దినంబైన ననలముఁ జొత్తుఁ
ద్రికరణవిశుద్ధిగా రఘుతిలక ! నిజము.

వ:- అమంగళము శాంతించుఁగాక. దాశరథులు సత్యప్రతిజ్ఞ లగు
దురుగాక.

శ్రీ:- భ:- ధన్యోస్మి.

భ:- గీ. విధిగ మీరుండఁదగినట్టిపీఠమందు
మీమహద సేవకుం డుండఁగాదు గాన
కరుణచే నిందు మీపాదుకాద్వయంబు
సింహపీఠాన నుంచి శాసింతుఁ బ్రజల.

శ్రీ:- తమ్ముఁడా ! పరమసంతోషము. అటులే యొనరింపుము. ఇవిగో
పాదుకలు (విడుచును)

వ, సు, సా:- భరతప్రభువునకు జై
భ:- (పాదుకలఁదీసి కన్నుల కద్దుకొనుచు) శ్రీరామపాదుకలకు జై.

గీ. బ్రహ్మరుద్రేంద్రులేని౯ బాల్పంగరాని
పాదుకాయుగ మమరె సేవకునివాలి
దినదినము పీసికని నివేదించి రాజ్య
కార్యములఁ గాల మెట్లులో గడపువాఁడ.

శ్రీ:- తండ్రీ ! శత్రుఘ్నా !

గీ. నాదువంతు సౌమిత్రి, యన్నా ! భరతుని
కీవు ; నామారుగా భ్రాత నెల్లకాల
మనుగమింపుము ; వర్షము లినములుగను
కడపి మిమ్ములఁ గన్నారఁ గాంచి వత్తు.

శ:- నాభాగ్య మిట్లున్నది కాఁబోలు. రామాజ్ఞకదా ? కానిండు.
భ:- శ:- (శ్రీరామజానకులకు సాష్టాంగప్రణామం బొనరించి కన్నీటితో) అన్నా ! సెలవా ?
శ్రీ:- చిరంజీవ ! సుఖీభవ.
జా:- వత్సా ! కళ్యాణమస్తు.
శ్రీ, జా, ల:- (కౌసల్యా సుమిత్రా కైకా వశిష్ఠులకు సాష్టాంగదండప్రణామ మొనరింప)
కౌ. సు:- (శ్రీరామ, జానకీ, లక్ష్మణుల కౌఁగిలించుకొని మూర్ధముల నాఘ్రాణించుచు) ఆయుష్మంతో భవత.
కై:- తండ్రీ ! రామచంద్రా !

గీ. సవతిమచ్చర మనెడిపిశాచ మొకట
భరతు రాజొనరించెడిభ్రాంతి యొకటఁ
జేరి లోకనిందను బొందఁజేసె నన్ను
తప్పు సైరింపుమయ్య శాంతస్వరూప !

శ్రీ:- అమ్మా ! నీవొనర్చినదానిలోఁ దప్పేమియు లేదు. నీయభీష్టంబు నెఱవేఱినవెంటనే తమ్ముని ప్రార్థనఁ దప్పక చెల్లింతు.
కై:- దీర్ఘాయుష్మాన్ భవ.
వ:- శీఘ్రమేవ పునర్దర్శనప్రాప్తి రస్తు.

భ:- అగ్రజా ! నామనవి జ్ఞప్తియున్నదిగదా ? ("పదియునాల్గేండ్లు" అనుపద్యముఁ జదువును)

శ్రీ:- నాయనా ! తప్పక వత్తును.

వ:- తథాస్తు. (శ్రీరాముఁడు, లక్ష్మణుఁడు, జానకి తప్ప నెల్లరు నిష్క్రమింతురు)

శ్రీ:- అనుజా ! సౌమిత్రీ ! దానవాకీర్ణమైనదండకాటవి నిష్కంటక మొనర్చి మనవనాగమనము సార్థక మొనర్చుకొన ఱేపే బయలు దేరుదము. అచ్చట మంచిచోటరయుము.

ఉ. నీ కనుకూలమౌ నెలవు నిందుముదంబిడు మాకు నట్టిచో
నాకులయి ల్లనుర్వు దృఢమై పెనుగాలిని, వాన నెండనున్
గైకొనకుండుదాని నొడికంబగునావరణంబుతోడ ము
న్నీకమలాయతాక్షి మదికింపగునట్టిహాయు ల్చెలంగఁగన్.

ల:- మహాప్రభూ !

ఉ. సేవను బొందుపట్టునను సేవకునిచ్చను గొందురే ప్రభుల్
దేవరయే సమస్తము తదేకశరణ్యుఁడనైనయట్టి నా
భావ మెఱుంగఁగోరి యిటుపల్కితి రంతియె కాని యాజ్ఞయిం
డే వెరనైన మీమదికి నింపౌనగూర్చునొ చేతు నర్థిన్.

శ్రీ:- నాయనా ! అందులకు కాదు. అనుదినము దేవతర్షిపూజనార్థమై జలసమిత్కుశాదుల సేకరింప శ్రమనొందువాఁడవు నీవు కాన నీ కనుకూలమగుప్రదేశంబునఁ బర్ణశాల నిర్మింపుమంటిని కాని పరీక్షార్థము కాదు.

ల:- స్వామీ !

గీ. మీదుకైంకర్యమును కోరిగాదె పురము,
రాజ్యభోగంబులను, ప్రియరమణి విడుట ?
కట్ట ! కైంకర్యమును శ్రమగాఁ దలఁతునె ?
పర్ణశాలకు చోటు తెల్పంగరాదె ?

శ్రీ:- అచ్చట మంచిచోటరయుము.

ల:- చిత్తము. సంసిద్ధుఁడనై యున్నాఁడ. ఇదిగో యేగుచున్నాఁడను.

(యవనిక జారును)

శ్రీ

# శ్రీ రాముపవాసము

## పంచమాంకము.

1. స్థలకము — అగస్త్యాశ్రమప్రాంతమునియుటజము.

(ముని కుశాస్తరణమునఁ గూర్చుండియుండును. మునిపత్ని వినమ్రయై నమస్కరించుచుండును)

ము. ప:- నాథా! నిన్నటిదినమున నవాఙ్మనసగోచరుం డగుపురుషోత్తమునిచర్యలగుఱించి యుపన్యసించుచుంటిరికదా ! నాకొకసందియము వొడమినది. తమవాఙ్మాధుర్యధురియుం దాప్లావమొనర్చుచు నంతరాయముఁగూర్ప నిచ్ఛయింపక మిన్నకుంటిని. కావున ముం దా సందియముఁ దీర్చి తదుపరి యుపన్యాసప్రారంభ మొనరింతురని ప్రార్థించుచున్నదాన.

ము:- సహధర్మచారిణీ ! ఆసందియ మేమో వ్యక్తీకరింపుము. భాగవతసేవవలనను, భగవదనుగ్రహముచేతను, అపారపారావారసదృశ శ్రీమన్నారాయణ మహిమంబున నేకించిజ్ఞుఁ డెఱింగినంతవఱకు సంశయవిచ్ఛేదన మొనర్చును.

ము. ప:- ఆచార్యా ! ఈతత్వము

గీ. త్రికరణంబుగ నిట్టిదన్రీతిఁ దెలియ
కుందువారలు నరులొకో ? యూర్ధ్వలోక
వాసులౌ బ్రహ్మరుద్రేంద్రప్రభృతు లెల్ల
రిట్టివారలా ? యధికులా ? యెఱుఁగఁ జెపుమ.

ము:- సాధ్వీ ! మంచిసందియమే వొడమినది. విశదీకరింపుచున్నాఁడ.

క. అలచతురాననుండె ప్రభువౌ పురుషోత్తము బొడ్డుతమ్మిలో
కల జనియించి నట్టెసలు పారఁగఁజూచి మఱొండు గాన కు

త్రిలపడి పేలవర్షములు తాపమున న్దవ మాచరించిన
న్దెలియఁగఁ గల్గె నుంత యవనీజనులెల్ల రెఱుంగ శక్యమే.

(తెరలో)

ఆశ్రమమున మునిపుంగవు లున్నారా ?

ము:- అతిథు లెవరో యుటజద్వారమున నుండి పిలుచుచున్న
ట్లున్నారు. నేఁ దోడి తెచ్చెద. అర్ఘ్యపాద్యముల సిద్ధపరచుము.

ము. ప:- మహాప్రసాదము. (ముని నిష్క్రమించి యిరువురు ఋషు
లతోఁ బ్రవేశించును. మునిపత్ని నిష్క్రమించి యర్ఘ్యపాద్యము
లతో మఱి రెండుకుశాస్తరణములతోఁ బ్రవేశించును)

ము:- (ఋషులను పూజించి) పూజ్యులారా ! ఈకుశాస్తరణములు
మీచే నలంకరింపఁబడుగాక. (ఋషు లాస్తరణములపైఁ గూర్చుం
డురు) ఋషిపుంగవులారా ! భవదాగమనకారణ మెఱింగించి
నన్ను ధన్యు నొనర్పుఁడు.

1 వ. ఋ:- మునిచంద్రమా! శ్రీమన్నారాయణతత్వామృతము మీ
వలన కర్ణపేయంబుగ వినఁ గుతూహలమూని వచ్చితిని.

2 వ.ఋ:- కర్ణరసాయనమొనర్చి ధన్యు నొనర్ప బ్రార్థించుచున్నాఁడ.

ము. ప:- ఋషిసోదరులారా ! త్వదాగమనమునకు ముం దిదే ప్రశం
సించుచుంటిమి.

1 వ.ఋ:- సోదరీ ! పరమసంతోషము.

2 వ.ఋ:- ఇట్టిదినము నేఁడు పర్వముకదా ?

ము:-మా. పారముఁగల్గనిపాపతమోనవభాస్కరు,నాపురుషోత్తము, వం
దారుజగజ్జనతాపహరు, న్ఖలదానవనాశనకారుని, నం
భోరుహనాభునిఁ, బుట్టువెఱుంగనిప్రోడ, నెఱుంగఁదరంబా? కొ?యె
వ్వారలకైనను వారిజసంభవ, వాసవ పంచముఖాదులకున్.

1 వ.ఋ:- భగవన్మహిమాభివర్ణన మమృతతుల్యముకదా ?

ఉత్సా:- వేదము ల్హరించినట్టివేదబాహ్యుఁ జంపి స
మ్మోదమునను మంథరంబు మూపున న్వహించియున్

సాదరమున ధాత్రిఁ బోవ నాహిరణ్యనేత్రుని
నోర్మది, యాత్రరక్షణంబుఁ బోలఁజేసితే హరీ !

2 వ.ఋ:- లాక్షణీ.

దానవశిశువును మనుప నృహరియవతారమున దనుజుఁదునిమితిగా!
దానవపతి బలి నడుగులత్రితయము దానము గొని వెసఁదరిమితిగా!
మానవపతులను దునిమి పితకు సురమార్గము శిరముల నిడితివిగా!
మానుల ముదముగ దనుజులఁ బోరిగొన మానవపతివయి వొడమి
తిగా ?

ము.ప:_ సు. రామ! రామ! రామ! రామ! రామ! రామ! రామతా!
ము:- భూమిజామనోధినాధ ! పుండరీకలోచనా !
వ. ఋ:- కామితార్థదా ! సురారికంటకా ! శ్రితావనా !
రామ! రామ! రామ! రామ! రాఘవా ! జగత్ప్రిభో !

(భజనలో నిమగ్నులై యుందురు) (ప్రక్కనను డి మువ్వురురాక్షసులు రాక్షససేనాని ప్రవేశింతురు)

రా. సే:- (1వరాక్షసుని చెవిలో) ఈగడ్డపు ముండాగొడుకుల సూశావు. తాగితాగ వాళ్ళులు తెలీక రామరామరామయని గోలపెడుతుండారు.

1 వ. రా:_ అవునుదొరో ! ఏమి చెలవు ?

2 వ. రా. దొరా ! సెవులు గింగురుబుట్ట రామరామ అంటారే యేంటది ? చెట్టా, గుట్టా, పామా, బండా యేంటది ?

రా. సే:_ ఓరియెఱ్ఱిముండాకొడుకుల్లాలా ! మనోళ్ళముసలిదాన్ని తాటకను, సుబాహుణ్ణి, విరాధుణ్ణి, వీళ్ళందరిని సంపేశాడే ఆరాసోడిపేరు. ఆయన్ను తెల్సుకుంటూ రాచ్చాసులు పోవాలె. చావాలె. చావాలె అనేజపందప్ప వీండ్ల కింకొకపనిపాట లేదురా.

3 వ. రా:- అయితే వీండ్ల నేంజెయ్యమంటారు దొరా !

రా. సే:_ ఒరేయి ! మఱుపుగొట్టుముండాకొడకా ! మళ్ళీ పాఠం సెప్పాలటారి ? ఆ ఆడదాన్ని పట్టుకెళ్ళి జుట్టుకు తాడుకట్టి ఆసె

ట్టుకు కట్టెయ్యి. ఈముగురు గడ్డాపోతుల్ను గడ్డాలు పట్టి
లాక్కొచ్చి గుడ్లగేసి దగ్గిరచెట్లకు బిగించి కట్టెయ్యండి. కొర
డాలతో దంచండి. ఆరాముఁడే రచ్చించాలిప్పుడు. (పైప్రకారము
కట్టి కొరడాలతోఁ గొట్టుచుందురు)

ము. ప:- (ఏడ్చుచు) ఆహా! తండ్రీ! రామా! నీ నామస్మరణము
చేసినందుల కిదియా ఫలము? అనాథనాథా! దీనదయాపరా!
ఇట్టికష్టపరంపరలనుండి పరిరక్షింపఁ నాయనా! ఎన్నాళ్ళీబా
ధల ననుభవించుట?

రా. సే:- (పకాపక నవ్వును)

ము:- (స్వగతము) తపశ్శక్తియుండియుండనగునాయిల్లాలిపాట్లు కండ్లారఁ
జూచుచు రక్షింపలేకున్నానుగదా! (ప్రకాశముగా) ఓరాక్షసాధ
ములారా! ఎంతకాలముతే యీతుచ్ఛపాటు! సాధ్వుల నిట్లు
బాధించుమీకుఁ గాలము దాపరించినట్లు తోఁచుచున్నది.

1వ రా:- పిల్లిశాపాల కుట్లు తెగుతాయిలే. నుండా నీగతి సూసుకో.
(కొరడాతోఁ గొట్టును)

ముని:- ఆ. ధాత్రిఁ గాచితంత్రు, దనుజార్భకునిఁ ద్రొల్లి
ప్రోచితౌను, యాగముఁ గాచితౌను
నిను భజించుచుండి నేఁ డిట్టులైతిమి
రామ! కావ రమ్ము రయముమీఱ.

1వ ఋ:- గీ. దండకాటవిలోన నీవుండ భయము
కలుగునాయని యుంటిమికాని యిట్టి
బాధలను పొందఁగలమ? విపన్నరక్ష!
రామ! దనుజవిరామ! రా రయముతోడ!

2వ ఋ:- గీ. దేహమెల్లెడ కశలచేఁ దెగినఁగాని
విడుతుమా రామనామంబు? విబుధవంద్య!
రమ్ము. రమ్ము. చేయూత కరమ్ము నిమ్ము
రమ్ము. దనుజారి! దశరథరామ! వేగ.

ము. ప:- గీ. దనుజబాధలఁ జిక్కి నుత్వత్పదాబ్జ
దాసి, కావంగ రమ్ము సత్వరమ, నీకు
నార్తరక్షణ బిరుదంబె యొప్పెఁ జెందు
నేను నీదాన రక్షింపఁబూను రామ! (మూర్ఛిల్లును)

(తెరలో)

గీ. అభయ మిడినాఁడ. వగవకుఁ డార్తజనులు
పాపఖండితాయుష్కుల జూపుమాప
రామబాణంబు వచ్చెఁ గీ రాక్షసాంత
కంబు, నార్తజనామోదకంబు కనుఁడి.

(రామబాణనిహతులై మువ్వురురాక్షసులు భస్మమై కూలుదురు.)

రా. సే:- ఏమి ఈ చెవులుగింగుఱుకొలుపుము గుండెలు సుడివడ చేయు చవ్వడి! ఏమిటిది! నాముగ్గురు పీనుగులే! (బూడిదరాసులు చూచి ఏడ్చుచు) అయ్యో! బాబ్బా! కుప్పకూలిరిరా! ఇదేం చోద్యంరా బాబూ! (రామబాణము తాకి) అబ్బా! అబ్బా! ఇదేం దెబ్బరా! బాబో! దేవుఁడా! ఎంతకు తెచ్చావురా! ఈ బాణం తగిలినతోలినుండి నెత్తుటికి రా దేంరా! కాల్చేస్తున్నది. (శరవేదన నభినయించుచు) కాలుతుండా. మగ్గిమసానమవుతుండా. రామ రామ రామ (అని భస్మమై కూలును).

ము. ప:- ఆహా! ఏమి యీచిత్రము! ఈ నలువురురాక్షసులు భస్మమైపోయిరి.

(శ్రీరాముఁడు ధనుర్బాణపాణియై ప్రవేశించుచు.)

శ్రీ:- జననీ! భయముడుగుము. భయముడుగుము. (మునిపత్నిని బాధ విముక్తఁ జేసి నమస్కరించును)

ము. ప.- రామచంద్రమూర్తీ! ఆర్తత్రాణదీక్షాబద్ధకంకణ! దీర్ఘాయుష్మాన్ భవ.

శ్రీ:- (మఱియొకదిక్కుఁ బరికించి) సోదరీ! తక్కినవారల విముక్తులఁ జేసివచ్చెద. (పోయి మువ్వురిబంధముల విప్పి నమస్కరించును.)

ము:- గీ. దనుజబాధలఁ జిక్కినమునిజనంబు
గాచినట్టిని న్నేమనఁ దోఁచదయ్యె
1వ ఋ:- ఆర్తరక్షణ దీక్షుఁడవై యమరు నీకు,
2వ ఋ:- సర్వకళ్యాణములఁ గాంచు జానకీశ!
శ్రీ:- జననీ! మునిచంద్రులారా! ఈప్రక్కడిరాక్షసులబాధ నెంత గ్రుడ్డుచున్నారలో గదా?
సు. ఋ:- వత్సా? వేఱుగఁ జెప్పవలయునా? ప్రత్యక్షముగఁ జూచితివిగదా? ఈప్రక్క భయానకదృశ్యమును విలోకింపుము.

గీ. కంటివే? రామచంద్ర! కంకాళసమితి
నవమునందెల్ల కానగాఁబడెడి నదియె
దానవకృతంబు లగుదుష్కృత్యముల కెల్ల
సాక్షిభూతమై యుండె సాక్ష్యంబు సుంగు.

శ్రీ:- జననీ! చూచితిని. సర్వము నెఱింగియే వారలకాలము తీఱకుండుటచే నూరక యుండవలసె. కాల మాసన్నమైనవారలెల్ల రిట్టిదుండగంబు లొనర్చి నాశము నొందెదరు.
ము:- రామచంద్రప్రభూ! ఈ దనుజుల మునిమి దండకాటవి నిష్కంటక మొనర్చుటకు డిన మమ్ముఁ గనరత మిట్లు బాధలఁ బెట్టుటయేకాక యెల్లప్పుడు తపోవిఘ్న మొనరించుచుందురు.
శ్రీ:- తాపసవర్యులారా! నారివారలయాయుఃపరిమితి నిండకున్నకత ముఁ నింతకు మనిరి.

క. భయము ముమునుఁ డింకమీఁద న
భయ మిడితి మునీశ్వరులతపంబులఁ బ్రోవన్
దయఁదాల్పక దానవులను
క్షయము నొనరించి సంతసం బొనగూర్తున్.

ము. 1, 2వ ఋ:- ధన్యోస్మి. ధన్యోస్మి. ధన్యోస్మి. ఇప్పటికి సనాధుల మైతిమి.
శ్రీ:- (నమస్కరించి) తాపసోత్తములారా! ఇప్పటికి సెలవా?

ము:- చిరాయుష్మాన్ భవ. సర్వదా విజయోఽస్తు. రామచంద్రమూర్తీ మఱువకుము.

శ్రీ:-మునీంద్రుల యనుగ్రహంబునఁ దప్పక కృతప్రతిష్ఠుఁడ నగువాఁడ.

ము. ప. సుగంధి:- (రామ రామ యనుపద్యమును పాడుచు భజన నారంభించును. ఆంగీరసాదులు వంతఁ బాడుచు భజనఁ జేయుదురు.)

(యవనిక జారును)

2 స్థలకము - దండకారణ్యములోని పర్ణశాల.

(శ్రీరాముఁడు, జానకి కుశాస్తరణముల నాసీనులై యుందురు.)

శ్రీ:- జానకీ! ఈ హేమంతఋతువైభవముఁ జూచితివా? ఆ కాసారమం దరవిందదళసీమపంక్తులం జూడుము.

ఉ. చల్లని నీటిలో మునుఁగఁ జేకి, తటంబున గూర్చుండియున్
మెల్లఁగ కాళ్ళు చాచుచును మించిన జాగ్రతతోడ ముంచెడిన్
ఆకరేణువులఁ బరికింపుము.
పెల్లగుదప్పిచేఁ గొలనివెంబడిఁ బోవుచు శీతబాధ మే
జల్లనిపింపఁ దొండమును జొంచియు నెక్కుడు కుందుచుం బాసెడిన్.

జా:- అగును. సర్వలోకముల వశీకరించుచున్న యీ ఋతువు జంతువుల భయపెట్టుట యేమిచిత్రము? ఆ పచ్చికబయళ్ళఁ జూచితిరా!

గీ. పచ్చికబయళ్ళనెడి లోహపాత్రములకు
హిమకరుండు కళాయిఁ బోయించె నిసిని
యతుల కుండినపట్ల సహస్రకరుండు
కించిదుష్ణంబుచే సరికించు పవల.

శ్రీ:- జానకీ! అగును. ఆఋషియుటజములవైపుఁ బరికింపుము.

గీ. ప్రాతరహ్నాంబునం దెల్ల భాస్కరుండు
వేడిమిం గూర్పకుంటచే వేల్మిడికడఁ
బుచ్చి మట్టమధ్యాహ్నముపూట బయల
హాయిగాఁ గూరుచున్న సంయములఁ గంటె!

హా.- చెలిమాటముందువలె చక్కగ కూర్చున్నారు. (శూర్పణఖ సుందరాకృతితోఁ బ్రవేశించును.)

శూ:- (స్వగతము) ఎవ రీ మిథునము ! గరుడ, గంధర్వ, కిన్నర, కింపురుష, యక్ష, రాక్షస మిథునంబుల సోయగంబును బురిణించుచున్నది. అనిమిషులు కాకుంట మానవులే. ఆహాహా ! ఏమాపురుషుని సోయగము ? ఆగంభీర్య మేమి ?

ఉ. నీరజవైరిఁబోలు మొగము, నిద్దపుటద్దములట్టి చెక్కులున్
జేరల మించుకన్నుఁగవ, సింగిణుల న్నిరసించు కన్బొమల్
నీరదసుందరాంగమును, నిర్జరనాథునిఁ బోలుఠీవి, యే
సారసనేత్రఁ గంతుశరజాలముపా లొనరింపకుండెడిన్.

[పరికించి] భళిరా!

చ. వెడదయురంబు, వైరిజనభీకరదీర్ఘకరంబులున్, రుచుల్
జడిగొనఁజేయుచూపులును, సామజయానము, మేఘనిస్వనం
బుసంగని మందహాసముల నొప్పెడి యిప్పురుషాగ్రగణ్యుఁ దా
నొడయునిగా వరించినకృశోదరి సార్థకజన్మ ధాత్రిపై.

ఈపున్నాగమును బొందని నాహృదయేందిందిరసార్థక్య మేమి ? ఏమి యిట్టియుపమ స్ఫురించెను ? అమంగళము ప్రతిహతముగుఁ గాక. మేఘముచెంగటి విద్యుల్లతఁబోలె నీయందగాని కురంగట మెలగు నీసుందరాంగిని బాపినఁగాని యీతఁడు నావశవర్తికాఁడు. ఈతఁ డెవరో, యొంటరిగ నీరాక్షససంచారయోగ్యం బగునీవనంబున నేటికి నుండెనో యెఱుంగ నామన ముద్వేగము వహించుచున్నది. కనుఁగొనెదను. (ప్రకాశముగా)

క. వనితామన్మథ ! యెవ్వని
తనయుఁడ ! వావాస మెద్ది ? తరుణీయుక్తిన్
వని నొంటరిగను దిరుగన్
జనుదెంచినచరితమెల్ల సాంతము చెప్పుమా.

శ్రీ:- వనితా !

గీ. అన్నియెడలను నాతుల్యుఁ డనుజుఁ డుండె
ప్రేయసీరహితముగ నావెంట వచ్చి
వానిఁ జేపట్టితేని సవతియు లేని
కంతుసుఖములఁ బొందఁగాఁ గలవు తరుణి.

శూ:- ఆర్యా! నీయాజ్ఞ నాసవమన్మఘునే దరిసెద [నిష్క్రమించును]

శ్రీ:- జానకీ! ఈకామాంధకావరముఁ జూచితివా?

గీ. కులము నెంచీరు, గుణముఁ జేకొనదు, పరువుఁ
దలపఁగాఁబోదు లజ్జను దరియనీదు
కంటికింపైనఁ గులహీను గవయఁజేయు
కామ మాఘంబు కాదె పంకజదళాక్షి!

జా:- కామాంధయయ్యు నార్యపుత్రుని వలచుటలో మాత్రము గుణగ్రహణపారీణయైనదిగదా?

శ్రీ:- దేవీ! కాదు కాదు. కేవలము పొరపాటు. గుడ్డివేటు పోయి గువ్వను తాకినట్లేగాని బుద్ధిపూర్వకము కాదు.

[తెరలో]

సీ. సేవకుని మనోహారివై చెలఁగుకంటె
దొరనికటమున దాసిగా నుంటరయ మేలు
* దాసునకు భార్యనైన సీతావధూని
కానుచర్యంబు సిద్ధించు నంబుజాక్షి!

జా:- ఆర్యపుత్రా! అనుపమానవిజితేంద్రియుం డగుసౌమిత్రివాక్యములు వింటిరా? అతఁడు కాదనుట నారక్కసి మరల నిటకు వచ్చుఁగాఁబోలు. భయమగుచున్నది.

శ్రీ:- కురంగాక్షీ! శ్రీరామబాహుకల్పితవజ్రపంజరపరీవృత వగునీ కేటిభయము! రానిమ్ము వినోదముఁజూతము.

---

* పాఠాంతరము. పైని యగ్రజా వలచినవనిత వగుట
తల్లి! వాఁడిగా దేగు మాధన్యుకడకు.

[శూర్పణఖ ప్రవేశించును]

శూ:- (ఖిన్నయై) మనోహరా! అచ్చటఁగూడ భగ్నాశనై వచ్చితిని.

చ. నిను మనసారఁగోర నవనీపతి నేను సతీయుతుండ నా
యనుజునిఁ గోరుమంటి, వతఁడైన దయంగన (‡కెన్నిసుగుణలో
వినుచుమఁ దన్నుఁగోరగను వీడిఁడిఁజేసె ననుగ్రహింపుమీ)
వనిత వరించివచ్చిన నభాసానరీతురు కావె పూరుషుల్ ?

శృంగారజమంతా! నీకెట్టులును తప్పను.

ఉ. నామనమోహనుండ వయిన న్సురనాకసమాన భోగముల్
మేమురలీలఁ బొంది రజనీచరసైన్యము గొల్వ, రావణుం
డాదరమూన లంకను విహారమొనర్పఁగఁగల్గ నేటికీ
బీదతనానఁ గానడవి వేఁగెద వాకలము ల్భుజించుచున్ ?

నీసంపూర్ణప్రణయసామ్రాజ్యము నేకచ్ఛత్రంబుగ నేలఁ బథంబు నిష్కంటకం బొనరించుకొందును.

క. ఈసరకాంతను నంజుడు
గా, నీయధరామృతంబుఁ గమ్మనిసురగా
పానమొనర్చి సపత్నియు
లేనిముదముఁ జెందుదాన లే లె మ్మింకన్.

(జానకిని కదిసి యాక్రష్ట మొనర్పఁబోవును.)

శ్రీ:- (శూర్పణఖ నెడమచేత వారించి) జానకీ! జడియకుము.

గీ. రామబాహువల్లరుల సురక్షితవగు
జానకీనీరజానన జంకె! దేల?
కంటకలతావృతసరసిఁ గాలుసార
సంబు చీఁకుచేనుంగ్గుకె జంక నేల?

సౌమిత్రీ! (లక్ష్మణుఁడు కరవాలపాణియై ప్రవేశించును)

---

‡ ... ... ... కగ్రజున్మఁ గో।
తివసతి వ్రాట మాతవు. వరింపఁగరాదని పంపిశాచేఁగా।

ల:- అగ్రజా! ఏమియాజ్ఞ?

శ్రీ:- సౌమిత్రీ! తన తరంబెఱుంగక మిక్కిమీఱి యధికప్రసంగ మొనర్చు నీరాక్షసాంగనకు నిశితకరవాలధారం గర్ణనాసికాభూష ణంబులచే సన్మానింపుము.

ల:- చిత్తము. ఆజ్ఞ. రాక్షసాంగనా! కదలుము.(భయపడి వడంకుచు ముందుకు సాంగ నిరువురు నిష్క్రమింతురు)

[తెరలో]

అన్నా! ఖరా! రావణా! కుంభకర్ణా! ఈనీచమానవులు మీచెల్లెలిని కొంచెపఱచి పరాభవము మీరెఱుంగరుకదా?

(సౌమిత్రి కత్తిపట్టుకొని నేర్పుచుం బ్రవేశించును)

శ్రీ:- జానకీ! నీచెల్లెలి కర్ణనాసికాభూషణంబులం జూచితివా?

జా:- లక్ష్మణుండు చెల్లెలిని బాగుగ నలంకరించినాడు. [నవ్వును]

సూ:- ఆ. [తలపంకించి] నాప్రియుడు వాహినికి పానకములో పుల్లవై యుద్ధపడి సిగ్గులేక నన్నుఁజూచి నవ్వుచున్నావా? [వ్రేలు చూపి బెదరించుచు]

గీ. రాజసముతోడ నీచతుర్దశభువనము
లాజ్ఞఁజేసెడిరావణు నను జన్మైన
నన్నరాభవమొనరించినారు కాన
వేయియిక్కట్ల సమకూర్చి వేచుదాన.

మీహననంబులు వ్యసనంబులుగ మాటినతీఱ సంతసించెద.
ఇంక మీపంథం బట్టెద. (జవనిక జారును)

3. స్థలకము — మారీచుండు సమాధినిష్ఠుండై యుండును.

(రావణుండు ప్రవేశించును.)

రావ:- (స్వగతము) ఆహా! చతుర్దశభువనవిజేతృం డగురావణునకు నేఁటి కొకవైరి యేర్పడినాఁడు. అష్టదిక్పతుల మూలల నదిమిన నాఁటనుండి యీవాక్యము నాశబ్దజాలమునఁగానఁబడక కానఁబడక

నేఁటికి మరల నవతరించుటచేఁ గొత్తదిగఁ దోఁచుచున్నది. ఐన నేమి ? నాకత్తి కడ్డు లేకే లేరవచుండ నొకసామాన్యనరునకా నరమాంసభోక్త నగునే జేసియవలసినది ?

ఉ. చేతులతీఁట వోవ ననిఁజేయుతలంపున నుండు నామనః
ప్రీతి నొనర్ప నీవరు విరించి సృజింపఁగ నుండనోపు, నా
ధాత నతిక్రమింపక ముకంబునఁ బోరఁగఁబోవు నిప్డె చే
యూతగ వీనిఁగొంచునను మహోద్ధతి రాముఁ బరాభవింపగా.

(వామాక్షిస్పందనము నటించుచు) ఏమి నాయెడమకన్నిట్ల దరుచున్నది ! అశుభము సూచించెడి. అదియును కొంతమట్టునకు నిజమే. జానకీస్వయంవరకాలమున నాహరుధనువుతోఁ బాటు నాగరువము కొంతవఱకు విఱిగినది. తదుపరి దండకారణ్యజనస్థానమునఁ గలఖరాదిప్రముఖులు పదునాల్గువేలరక్కసులు నసహాయశౌర్యమున ద్రుంచినది తలంచిన హృదయము కలఁచినట్లున్నది. అట్టివీరవరునితోఁ జివ్వఁగొననేల యని యనుకొనిన శూర్పణఖ పొందినపరాభవమునకు ప్రతీకార మెట్లు ? (కొంచె మాలోచించుచు)

ఉ. నాదుహితంబె మానసమునన్ దలపోయుహితాళివాక్యముల్
గాదనుటా ? సహోదరిని కాఱియఁ బెట్టినమానవాధముల్
బేద, సహాయహీనుఁ గడుపెద్ద నొనర్చి యుపేక్ష సేయుటా !
యేది విధంబు ? శూరుఁడు సహించునె శత్రుకృతాపరాధముల్ ?

దుర్భరము. దుర్భరము. శూరుఁడు శత్రుకృతాపరాధము సహింపఁజాలఁడు. సహింపనే సహింపఁడు.

గీ. దూత కొనరించినట్టి దుందుడుకుపనిని
సహిత మోర్వంగఁగలఁడొకో ? శౌర్యధనుఁడు ?
చెల్లియలిముక్కుసెవులఁ గోసినవిరోధి
సైచు నెటు రావణుండు దుస్సాధ్యబలుఁడు ?

అదియునుంగాక శూర్పణఖ వర్ణనానుసారముగ త్రిజగన్మోహిని యగునాసీతనుమాత్రము విడువఁజాల. అందులకై యాశూ

రుల నామెచెంతనుండి విడదీయుటకై మాయామోహితభువనుం డగు నీమారీచు సహాయ మత్యవసరము. కార్యశూరులపట్ల దార్జ న్యముకంటె సామమే ఫలకారి. మున్ముం దాపథమే తొక్కెద. (మారీచుని సమీపించి తట్టి) తండ్రీ! తండ్రీ! లెమ్ము. లెమ్ము. అత్యవసరకార్యము.

మా:- (ఉలికిపడి నిమీలితలోచనములతోడనే) నిద్రోషిని. కావు. కావు. మహాప్రభో! (భయదైన్యముల నభినయించును)

రావ:- (వెన్ను చఱచుచు) తండ్రీ! తండ్రీ! భయమందకుము. నే రాక్షసచక్రవర్తిని. రావణుఁడను.

మా:- (కొంచెము భయమువీడి) రా (నాలుకఁ గఱచుకొని) ప్రభూ! ఏమంతత్వరగాఁ బిలిచినకారణము? ఈయర్ఘ్యపాద్యవన్యము లను స్వీకరింపుఁడు. (ఇచ్చును)

రావ:-(అర్ఘ్యాదులఁ దీసికొని) సచివాగ్రణీ! నీసపర్యలఁ దృప్తుఁడనైతి నే నొకకార్యార్థినై వచ్చితిని వినుము.

మా:- చిత్తము.

రావ:- మారీచా!

గీ. జగము లన్నింటఁ వలపింప జాణయైన
లలిత, రాముసతిని సీత లంకలోనఁ
బెట్టి పెండ్లాడవలతు సంప్రీతితోడ
మాఱుఁబల్కక తోడుగమ్మా మహాత్మ!

మా:- ప్రభూ! ఇది పరమదుస్సాధ్యకార్యము. మీకుమిక్కిలి ప్రాణ మననేల, వంశాపకారకారణకార్యంబుగాన నడుగుట పరమశ్రే యోదాయకము.

రావ:- (స్వగతము) బాగుగనున్నది. "ప్రథమకబళముననే మక్షికా పాతమా?" అయిన నేమిచెప్పునో వినెద.

మా:- గీ. నీవు సుఖముగ నుండుట, నీదురాజ్య
మెల్లననుజులు కుశలులై యుంపుమీఱ

మనుట యిచ్చ లేనట్టిదుర్మార్గుఁ డెవఁడొ
చెప్పుమాటల విని యేల చెడెదవయ్య!

గీ. సత్య మెఱిఁగించువాఁడ నిస్సంశయముగ
దండధరుపురి కేగ నుత్సాహుఁడైన
వాఁడు దక్క నాయుపదేశువాకితూపు
గమిని బడి మఱలినవాఁడు కానరాఁడు.

నామాట వినుము. రామబాణమాహాత్మ్యము నీకుఁ గ్రొత్త దగుట వినుము.

పంచపాది గీ. రామతూణకులాయము రయమున విడి
తెక్క లిరుచక్కల న్విప్పి చిప్పుమనుచు
వైరిప్రాణవిహంగాళిఁ బట్టి చంప
వచ్చు రామాస్త్ర మను నాళువంబు గాంచి
నిబ్బరముఁబూని ప్రాణము ల్నిలుచునొక్కొ!

అట్టిదాని కేటికి వృధగ నెరయయ్యెదవు? స్వానుభవమునఁ బల్కుచున్నాఁడను. అది యొకపరి నన్ను దక్షిణసముద్రమున ముంచివైచెను. మఱియొకతూరి నన్నును నాతోడి మఱియిరువుర రక్కసులను వెంబడించి వారలను పొలియించె. అదృష్టవశమున నే నెట్లో తప్పించుకొని సన్యసించి యిట తపంబొనరించుచున్నాఁడ. ఆబాణనినద మింకను నాచెవుల గింగురువెట్టుచు సర్వశబ్దములను, లోకమందలి సర్వస్థావరజంగమములను (అతిత్వరతో) రామ మయం బొనర్చుచు నిదురఁగూడ పట్టనిచ్చుటలేదు.

గీ. "రా"యనెడి యాదిఁగల్గినప్రతిపదంబు
భయదమై తోఁచుచుంట నాప్రాణములకు
నిన్ను నీపేరఁ బిలువంగ నేరనట్లు
చేసె నూహింపుమా నృపసింహమహిమ.

బతిమాలుకొనెద. నామాట వినుము. నీమొండిపట్టు విడుము. దానవవంశము సుఖించుమార్గముఁ గనుము. ఆచంద్రార్కము మనుము.

రావ:- మారీచా! నీఘోరణియే నీదికాని యొరునిమాట చెవిదూఱ నిచ్చునటుల లేదే.

ముక్కు సెవులు తెగినచెల్లెలిమొగముఁ జూచుచు చేతులకు గాజులఁదొడిగించుకొని మూలఁగూర్చుండుమందువా? అట్టిపన్నటికి పౌనఁగదు. మాయామృగమవై రామలక్ష్మణుల సీతను బాపి దవ్వుగఁ దీసికొనిపోవుసహాయము చేయకతప్పదు.

మా:- ప్రభూ!

గీ. నిజ మెఱింగింతు రామభూనేతకంటఁ
బడిన నెవ్వంటఁ జచ్చినవాఁడ నేను
జానకినిఁ గొని దక్షిణాశకును మరల
యమపురముఁ జేరఁ బయనమైనట్లు నీవు.

సత్యాలాపులకు ప్రభుమతం బనవసరముకదా?

రావ:- మరల నీసుద్దులమొదలిడితివా? నాతీర్మానము మార్ప నెవ్వరి వశము కాదు. మాయామృగంబవైనచో రామునిచే చావుసంశయాస్పదము. సహాయనిరాకరణ మొనరించితివేని నీమృతి నాచేత నిశ్చితము. ఆలోచించుకొని సముచితపథగామి వగుదువుగాక.

మా:- (తల పంకించి స్వగతము) నిజము. నిజము.

గీ. మృత్యువాసన్నమగువారు మిత్రహితము,
నల యరుంధతి, దీపనిర్వాణగంధ
మించుకేనియు వినరు, వీక్షింపఁ బోరు
ఘ్రాణ మొనరింప రనుట నిక్కమిటఁ గంటి.

ఈవినఁనేరనిమూర్ఖునిచేతిలోఁ జచ్చుటకంటె పతితపావనుండును, పావతమోభాస్కరుండు, ననహాయశూరుండు నగుశ్రీరాముని శరము బారిఁబడి వీరస్వర్గ మొందెద మోక్షమొందెదమో యొందు. (ప్రకాశముగా) ప్రభూ! అటులే కానిండు. మీయిష్ట మెల తీర్పకపోవలయును?

గీ. రామబాణానలంబున మ్రగ్గనున్న
నేను, యమగదాదండసన్నిహితుఁడ వగు
నీవు తుల్యుల మగుటచే నేస్త మబ్బె
విధిని మీఱి చరింప నావిధివశంబె ?

రావ:- తండ్రీ ! ఈమాటల కేమిలే. అగ్నికి వాయువువలె నాకు నీవు బాసటయై వచ్చిన కానికార్యముండునా ? ఇంతకుముందు పల్కిన పలుకులన్నియు నీవేయని నే నమ్మఁజాల. నమ్మఁజాల. ఇప్పుడు నాహితుఁడవును సచివుఁడవగు నీమారీచుఁడ నైతివి. లెమ్ము. ఆశ్రమద్వారమున రథము నిలిచియున్నది. పోవుదము పద.

మా:- సరియే కానిండు. ఇదిగో వచ్చుచున్నాఁడ.

(యవనిక జారును)

4. స్థలము — దండకాటవి. శ్రీరామపర్ణశాలాప్రాంతరంభావనము.

(మారీచుఁడు ప్రవేశించును)

మా:- ఈరంభావనమే యానృపాలునాశ్రమమున కానవాలని దశకంఠుఁడు నుడివె. నాకు నేఁడే తుదిదినము. దశాస్యునివాంఛఁ దీర్ప మాయామృగాకృతి వహించి నా పాత్రము జయప్రదముగ నటింపఁ బ్రయత్నించెద.

గీ. జననమాదిగ సాధుహింసావ్రతమున
తాపసులమాంసమునఁ బ్రవర్ధనముఁ గనిన
పాపిదేహంబు ప్రభుహితవర్తనమున
రామబాణభోజ్యమయి సార్థకముఁ గనుత.

(నిష్క్రమించి మాయామృగమై ప్రవేశించి మసలుచుండును. జానకి పువ్వులబుట్టతోఁ బ్రవేశించును)

జా:- పుష్పాపచయమైనది. పర్ణశాలకు సత్వరమేగవలయును. (మాయామృగమును బరికించి యాశ్చర్యాద్భుతములతో) నాకన్నులు భ్రమించుట లేదుకదా (నిదానించి చూచి) కాదు. కాదు. నిజము. నిజము. ఏమాయీమృగసౌందర్యము ?

సీ. నీలంబులై రమణీయంబులై యొప్పు
నేత్రి, శృంగ, ఖురాళి నీటుఁగులుక
కోకనదంబులకును సామ్య మగుమోము
సితనీలలాంఛనాంచితము గాగ
స్వచ్ఛమా శారదాశశిఁ బోలునుదరంబు
కాంతిపుంజంబునఁ గ్రాలుచుండ
జలజకేసరములఛవి మధుపవ్రజాలు
రోమరాజి మఱింత గోముఁ జూప

గీ. వాలు పైకెత్తి హరిచాపమట్లు రుచుల
దశదిశలఁ జెల్లుహారిణపోతంబు కాంతి
మగుచు నామనోహారిణంబు నట్టె లాగు
దీని నెట్లైన సాధింపఁ బూనుదాన.

ఆర్యపుత్రా! ఆర్యపుత్రా! వత్సా! లక్ష్మణా! సద్దుచేయక పరువిడుఁడు. పరువిడుఁడు. (శ్రీరామలక్ష్మణులు పరువునఁ బ్రవేశింతురు)

శ్రీ:- జానకీ! ఏమి? ఏమి? ఏల యిట్లతిత్వరితగతిఁ బిలిచితివి?

ల:- తల్లీ! అంతత్వరగాఁ బిలుచుట కేమి విశేషము?

జా:- వత్సా! నాథా! సద్దుచేయకుఁడు. మెల్లగా మాటాడుఁడు. ఆరంభావనాంతరమునఁ గలహేమమృగంబుఁ జూచితిరా?

శ్రీ:- అగును. జానకీ! నిజము. అయిన నేమందువు?

జా:- ప్రాణకాంతా! వనవాసమునకై వచ్చినదాది యొక్క కోరిక నైనఁ గోరకుంటిఁగదా?

శ్రీ:- జానకీ! ఎవరు కోరవలదనిరి? ఇపు డీహరిణపోతము కావలయునా యేమి?

జా:- మనోహరా! మనోహారిణులయింగిత మెఱింగి వారికోర్కులఁ దీర్చునాయకులు కలుగు టరుదు. అదియే నాకాంక్షితము.

ఆ. సాధ్యమైన ప్రాణసహితంబుగాఁ దెండు
కానియెడలఁ జంపియేనిఁ దెండు
వింతమృగము లేక వింతయౌ యజినంబొ
యడవి నున్నచిహ్న మగును మనకు.

ఆయజినంబు మన మిరువురము కూర్చుండ బహుసుందరముగ నున్నది. దాని నేవెరవుననైనఁ దెచ్చి నాముద్దుఁ జెల్లింపుఁడు.

ల:- అగ్రజా ! చిన్ననాఁటనుండియు మృగయావినోదంబు సలుపుచుంటిమి కాని యెన్నఁడేని యిట్టివిచిత్రమృగముఁ గంటిమే ? ఇట్టి విషయము వింటిమే ? మారీచుఁడు మునుల వంచింప నిట్టిరూపుఁ దాల్చి వచ్చి వారిని వధించునని వింటిని. ఇది రాక్షసమాయ యనియే నాగట్టినమ్మకము.

శ్రీ:- సౌమిత్రీ ! కానిమ్ము నిజ మగుహరిణమైన సరియే. కాకుండిన దానిభాగధేయము రామబాణమే నిర్ణయించును.

ల:- చిత్తము. సత్వరము తిరిగి రండు.

జా:- ప్రాణకాంతా ! తప్పక తేవలయును.

శ్రీ:- జానకీ ! ఇదిగో పోయివచ్చెదను. లక్ష్మణా ! నేవచ్చువఱకిచ్చోటు వాయక జానకిని సంరక్షించుచుండుము.

ల:- చిత్తము. (శ్రీరాముఁడు ధనుర్బాణపాణియై నిష్క్రమించును)

జా:- సౌమిత్రీ ! రాక్షసు లిట్టిమాయావేషముల నేల చరించెదరు ?

ల:- తల్లీ ! మునుల మోసగించి చంపుటకు.

(తెరలో) హాసీతా ! హాలక్ష్మణా ! హాసీతా ! హాలక్ష్మణా !

జా:- (అదరిపడి) సౌమిత్రీ ! మీయన్నయార్తనాదము వింటివా ? తత్క్షణము పోయి సాయపడుము.

ల:- (నవ్వి) అయ్యో ! వెఱ్ఱితల్లీ ! ఇది యన్నకంఠధ్వని ననుకరించు నేరాక్షసకంఠనాదమో కాని యగ్రజునికంఠనాదము మాత్రము కాదు. జడియకుము. ఆయసహాయశూరునకు వచ్చినభయ మావంతయు లేదు.

జా:- సౌమిత్రీ! 'పిల్లికిఁ జెలగాటము ; ఎలుకకు ప్రాణసంకటము.' మీరాయన్న కటకటంబడుచుండ వికటహాస మొనర్చెద వేమి? నాయనా! పోయి తత్క్షణమ సాయపడుము. జాఁగుచేయకుము.

లః:- పిచ్చితల్లీ!

క. పసలేని క్షుద్రుఁడా ర
క్కసునులివు న్వినుచు రాముకంఠధ్వనియం
చు సహాయ మొనర్పఁగ న
న్వెసవినఁ బొమ్మనెద వెట్లువిడి చనఁదగు నిఁక ?

క. పదునాల్గు వేల దనుజులు
పొదలిన నసహాయశౌర్యమునఁ జంపిన బె
ట్టిదుఁ డగుత్రిలోకజైత్రుని
కొదవున యిక్కట్లు దుఃఖ మొందెద వేలా ?

జా:- సౌమిత్రీ! నీవు చెప్పుమాటలు జల్లెడలోనినీళ్లవలె నామనమున నిలుచుటలేదు. నీవు తత్క్షణమ బయలుదేరి యన్నకు సాయపడుము.

లః:- తల్లీ! త్వరపడకుము. అగ్రజుఁ డింత కామృగమును గొనివచ్చుచునే యుండును.

జా:- ఎచ్చటికి వచ్చు నింకను? మృత్యుముఖమునఁ జిక్కినవాఁడు మరలివచ్చుటయేనా?

లః:- తల్లీ! ఎంతపిచ్చి! శ్రీరాముని కెక్కడిమృత్యువు?

గీ. మేరుగిరి వ్రయ్యఁగానిమ్ము, మిన్ను భూమి
పైనిఁ బడనిమ్ము, భానుండు పశ్చిమాశఁ
బొడమనిమ్మమ్మ హత్తునిబొటనవ్రేలిఁ
గదపఁ గలవాఁడు లేఁడు నిక్క మిది నమ్ము.

మాతా! నామాట నమ్మవుకదా?

జా:- సౌమిత్రీ! ఎంతవాఁడ వైతివి? ఇట్టిమేకవన్నెపులివని యెఱుఁగ నైతిని. భక్తి గలవానివోలె నన్ను ననుసరించిన దిందులకా? ఇప్పటి కెఱుఁగఁగల్గితిని.

ల:- తల్లీ! స్త్రీజనసైజ మగుమరభిప్రాయముఁ బూని కర్ణశూలాయమానము లగుపలుకుల నన్నేల యలయించెదవు? అన్నమాట మీఱలేకయు, ససహాయను నొంటరిగ మిమ్ముల నుంచిపోలేకయు, సహోదరశౌర్య మెఱింగినకతనను నిట్లుంటినేకాని వేఱొక దురాలోచన లేదని మీపాదములసాక్షిగ బాసఁజేసెద.

జా:- ఛీ! సౌమిత్రీ! నన్నంటరాకుము. ఇఁక నీమొగముఁ జూచిన మహాపాతకము వాటిల్లు.

ల:- తల్లీ! శ్రీరామచంద్రుఁడే యొల్గిన నీ సౌమిత్రిమాత్ర మగ్రజు ననుసరింపక మనువాఁడా?

జా:- ఆ (తల పంకించి) 'స్వర్గమునకుఁ బోయిన నాఁడిమేకులు తప్పవా'? కష్టకాలమున నన్నకు సాయపడఁబోవని సోదరబ్రువుఁ డుండిననేమి యుండిననేమి? తిరిగి మాటాడితివేని యగ్రజుని యాన కలదు. అగ్రజునిమాట మీఱఁగూడదనునీతి నుగ్గడించితివి కదా; యగ్రజునర్ధాంగిమాటయెడలఁగూడ నట్టిధర్మ మేల పాటింపవు.

ల:- (స్వగతము) అబ్బా! దుర్భరము. దుర్భరము. కర్ణకఠోరము. ఈవడగండ్లకుఁ దలయొగ్గుటకంటె నగ్రజునికోపాశని కెదురేగుటయే మేలు. ఏమొనర్తు? వెడలక తప్పనిసరివచ్చె. (ప్రకాశముగా) ఓపంచభూతములారా! వనదేవతలారా! ఈక్రుద్ధజనని నోమవలసినభారము మీపాలఁబడినది.

చ. జనకునినోముపంట, సురశాత్రవకంటకుఁ డైనరామచం
ద్రునినెఱజంట, కర్మఫలరూక్షత నొంటిగ వీడియేగునా
మనవిని చిత్తగించి సుకుమారి ననుగ్రహబుద్ధిఁ బ్రోచి యా
జనపతి రామచంద్రకరసారసమం దిడరమ్మ మ్రొక్కెదన్.

జనసీ ! నే పోయివచ్చెద. జాగరూకత నుండుము.

(లక్ష్మణుఁడు నిష్క్రమించును)

జా:- మరల నాసవ్వడి వినరాదేమి ? ఒంటరిగ నుండ భయమగు చున్నది. ఏమొసర్చుటకుఁ దోఁచకున్నది.

(జవనిక జారును)

5. స్థలకము — శ్రీరామపర్ణశాల (జానకి కుశాస్తరణమున నాసీనయై విచారించుచుండును)

జా:- అకటా ! హేమమృగార్థం బేగినప్రాణనాథునిజాడ కానవచ్చుటలేదు. ఆయార్తనినదము వినఁబడినంత సస్తేరంబులాడి సాయమొసర్ప సౌమిత్రిఁ బంచితిని. ఇరువురిపాలకుడ కానరారు. ఏమి కతమో తెలియఁజాలకున్నదానఁ గాని కడుపుఁలోఁ జెయివెట్టి కలఁచినట్లున్నది.

(తెరలో)

భవతి భిక్షాం దేహి-భవతి భిక్షాం దేహి.

జా:- ఎవ రాభిక్షువు ? (ద్వారమునైపు చూచుచు నెమరొక్కన లేవఁబోవును. రావణుఁడు భిక్షుకరూపమునఁ బ్రవేశించును)

రా:- (స్వగతము) ఆహా ! జగన్మోహనాకారము. కనులు సార్థక్యముఁ జెందినవి. అందమనిన నిదియే యందము. కాని తక్కినవన్నియు నందములా ? జనకునియింటఁ జూచినప్పటికిని నిప్పటికి నెంతవ్యత్యాసము కలదు ?

చ. అనిమిషకామినీమణుల, నచ్చరలేమల, కిన్నరాంగనా
జనముల, నాగభోగినుల, చారణకాంతలఁ గంటిఁ గాని యీ
యనుపమసుందరాంగి కెనయైనలతాంగముఁ గాననైతి నా
జనకునివీటఁ గాంచినపసందును మించుహొయ ల్జెలంగెడిన్.

అప్పు డాహరధనుర్భంగపణ మొకఁడుండఁబట్టి నా కీసుకుమారి దక్కినదికాదుగాని యసహాయయగుజానకి నేఁడు దక్కక యెచ్చటికేఁగఁగలదు?

ఉ. చేరల, నిగ్గుటద్దముల, శీతకరు, న్నిలపుష్ప, బింబ, శ్రీ
కారము, చక్రవాకయుగ, కాంచన, పన్నగజైత్రి లైనశృం
గారపుకండ్లు, చెక్కిళులు, కమ్రముఖంబును, నాస, యోష్ఠము,
న్నీరగుపీనులు, స్తనులు, నీటగుమేనును, వేణి యొప్పెడిన్.

సౌభాగ్యరాసుల కిది యొక్కటియే కొమవ. ఈస్త్రీరత్నమును బొంది సార్థకజన్ముఁడ నయ్యెద. ఆలస్య మొనర్పఁదగదు. (ముందున కడుగిడును)

జా:- యతీశ్వరా! పరాయత్తచిత్తు లైనట్లున్నారే?

రా:- తరుణీ! లేదు.

క. ఫల, పర్ణ, సలిల, మారుత
ములఁ దినుచును గడపుసాయముల చిత్తములన్
వలవంతలలో నిడుచిలు
కలకొలికీ! నిన్నుఁ గాంచి కళవళపడితిన్.

రాజ్యభోగార్హ మగునిట్టిలతాసుకుమారశరీరముతో నీకూర మృగరాక్షసాకీర్ణ మగునీయరణ్యమున నొంటిగ కాలముఁగడపుట కడునాశ్చర్యముగ నున్నది. అభ్యంతరము లేదేని నీచరితము విన వలతు.

జా:- యతీశ్వరా! ఈయర్ఘ్యపాద్యములఁ గొనుఁడు. ఆవల నాచరిత్రము సాంతముగ నెఱింగింతు. (యతీశ్వరున కర్ఘ్యపాద్యముల నొసంగును.)

రా:- కామినీ! నీసపర్యలఁ దృప్తుఁడనైతిని. ఇఁక నీచరితము విన వలఁతు.

జా:- యతీశ్వరా! ఆకుశాస్తరణమునఁ గూర్చుండుఁడు. నాచరిత మెఱింగింతు.

రా:- సరియే మెఱింగింపుము.

జా:- యతీశ్వరా! నే మిథిలేశ్వరుఁ డగుజనకునితనయను; సీతను. కోసలాధీశ్వరుఁ డగుదశరథునకుఁ బెద్దకోడలనై శ్రీరామచంద్రున

కర్ధాంగినై సర్వభోగముల పండ్రెండేండ్లత్తవారియింట నుండ మామామగారు నాభర్త నభిషిక్తుంజేయందలంప నాతనియనుంగు భార్య యగుకైక కిచ్చినవరములంబట్టి నాభర్త వనవాసమొనర్చు నటులను కైకేయీపుత్రుఁ డగుభరతుఁడు రాజ్యముచేయునటుల నేర్పడె. పితృవాక్యపాలనాధురంధరుం డగునాభర్త యరణ్యా వాసమునకు వచ్చునప్పు డితని కేమిటను తీసిపోవనియసహాయ శూరుఁ డగునాచిన్నమఱఁది సౌమిత్రి గూడ మావెన్వెంట వచ్చె. అగ్నిదేవునకు వాయుభట్టారకుఁడు సహాయమగునటుల నిరుప మానశౌర్యధనుఁ డగునానాథునకు నసహాయశూరుఁ డగుతమ్ముఁడు తోడై రాక్షసాక్రాన్త మగుదండకాటవిని నిష్కంటక మొనర్చుచుఁ దపస్వుల కభయమొసంగుచున్నారు. వారిరువురు మృగయావినో దార్థ మరణ్యమార్గమునఁ బోయియున్నారు. ఇంతకు వన్యంబులఁ గొనివచ్చుచుందురు. వారు వచ్చుదనుక విశ్రమింపుఁడు. మీగో త్రనామంబు లెఱింగింపుఁడు.

రావ:- గీ. ఎవనినామంబు చెవిసోక నెల్లసురలు
దానవులు, మానవులు, నెల్లస్థావరములు,
జంగమంబులు వడఁకునో సారసాక్షి !
యట్టిరావణబ్రహ్మ లంకాధిపతిని.

సుందరాంగీ !

మత్త. భూరిభోగము లందఁబుట్టినబోటి యీగతి కానలో
కూరగాయల మెక్క నేటికి కోమలాంగిరో ! దీనత ?

సీ:- నీరజోద్భవువ్రాలు మీఱఁగ నేర్తురే యెవరేని ? చే
కూరు కష్టసుఖాళి కావడికుండలట్టుల; మాఱవే ?

రావ:- ధాతవ్రాలుకు భీతియేల ? హితంబుఁ జెప్పెద కాంత ! యీ
రీతి కష్టముఁ బొందనేటికి ? ఆక్కఱేని మొగంబ ! సం
ప్రీతితో నినుఁ బెండ్లియాడి యభీష్టసౌఖ్యముఁ గూర్చెద
నే తలోదరి ! జాలమేటికి ? లెమ్ము లెమ్మిఁక వేగమే.

జా:- నల్లఁ దాఁగ్రివుదురాత్మ ! మానవనాథుకాంత నిటాడఁగా
కల్లుఁదాగ్రివుట మత్తుచే నిటుకాఱు లూరక పేర్లెదే ?
బల్లిదుం డగురామచంద్రునిబాణవహ్నిని మగ్గకే
చెల్లగా దయచేయు మేటికి ? సాహసించెదు మూర్ఖుఁడా !

రావ:- శంకరాచల మెక్కకేలను చూన ! యెత్తినవాని ని
శ్శంకవృత్తి నదల్తు వెంతటిజాణవే పరికింపఁగన్ ?

జా:- బింకమేటికి రుద్రచాపము వీపుపైఁ బడలేదొకో ?
పంకజాక్షులయొద్ద నేటికిఁ బల్కె దిట్టిప్రగల్భముల్ ?

రావ:- మేరమీఱి తృణీకరించుట మేలె రాక్షసనాథునిన్ ?

జా:- మేర యేకద ? యన్యదారఁ దమి న్గ్రహింపఁ దలంచుటల్ ?

రావ:- పౌరుషం బిది వైరికాంతను బందిఁజేయఁ దలంచుటల్.

జా:- పౌరుషం బిదె తస్కరించుట భర్త యేమరియుండఁగన్.

రావ:- వారిజానన ! పల్కులేటికి వైశమే రథ మెక్కుమీ

జా:- ధీరుఁడౌ రఘురాముదేవిని తేఱిచూడఁ దెగించెదే ?

రావ:- వైరికాననవీతిహోత్రునిఁ బంక్తికంధరుఁ జూచితే ?
(నిజరూపముఁ దాల్చును)

జా:- (భయపడి కానవాక తేఱి పారఁజూచి స్వగతము)
వీరు లింకను రారు ద వ్వటవీస్థలి నునియుండుటన్.
ఏమొనర్పఁగలను ? (యోజించు చుండును)

రావ:- (స్వగతము) ఇఁక నాలస్యముఁ జేయఁజెనదు. ఈజానకిని రథం
బున నెక్కించుకొని సత్వరము లంకాభిముఖుండను కానిచో నా
శూరవరులు వత్తురు. (జానకిని బరికర్షణమొనర్చి రెండుచేతుల
మీాద మోసికొనిపోవ యత్నింపఁగా)

జా:- శా. త్రిజగచ్ఛూరుఁడు, మేరుధీరుఁడును, నార్తీభూతదైత్యుండు,వి
శ్వజనస్తుత్యుఁడు, రామచంద్రధరణీభర్తార్ధదేహంబనై
విజనం బైనయరణ్యసీమ నిటుపాపిష్ఠాత్ముచేఁ జిక్క న
శ్వజమై తోఁచెడి దీనబంధు లెవరే న్గన్పట్టరే ? లేరొకో !

గీ. పంచభూతంబులార ! దిక్పాలులార !
వృక్షతతులార ! ఖేచరా పక్షులార !
రాముదేవి జానకి ననర్గళత రావ
ణాసురుఁడు కొనిపోయెడి నడ్డుపడరె.

(మూర్ఛిల్ల రావణుఁ డెత్తుకొని తేరుపైనఁ బెట్టును)

(తెరలో)

చ. నిలునిలు పారిపోవకుర నిర్జరకంటక ! రావణాధమా !
ఖలుగతి సీతఁ దొంగిలుట కాదు ఖగేంద్రుఁడ వచ్చినాఁడ వే
సలుపుము యుద్ధ, మెచ్చటకు సాఁగఁగలాఁడవు? నాదుబారికిం
దొలఁగిచనంగ శక్యమొకొ ! దుర్జనకృత్యము సాఁగివచ్చునే ?

రావ:- ఈపేర్మిలరి యగుపక్షికి బాణవృష్టియే బుద్ధికరపుఁగాక. (జానకి నొకచేతఁ బట్టుకొని మఱియొకకరముచే తెరలో నిజటాయువుతో యుద్ధమొనరింపుచు నామె నట డించును. జానకి మూర్ఛదేఱి)

జా:- ఆహా ! ఏమియీజటాయువుపరాక్రమము ! దీనరక్షకుఁడా నీఖగేంద్రుఁడు విజయుఁడగునట్లు భగవంతునిఁ బ్రార్థించెద. (మౌనమునఁ బ్రార్థించి) ఆర్తరక్షణమన నిట్లుండవలయునుగదా ?

గీ. తనదుదేహంబు రావణాస్త్రక్షతమయి
రక్తమును గ్రక్క సుంతధీరతఁ దరుగక
యసురుశీర్షకంబుల నెల్ల నవనిఁ గూల్చి
నఖములం జీల్చి దారితముఖు నొనర్చె.

తేరుఁగూడ నుగ్గొనర్చినాఁడే ? బళిరా! ఖగేంద్రా ! నీకు నేనేమిప్రత్యుపకృతిఁ జేయఁగలను ? అరరే ! రావణుఁడు జటాయువుధాటి కాగలేక చంద్రహాసంబుఁ బెఱికి తనశిరముపై నాడుచున్నఖగేంద్రునిపక్షములకు గుఱిచూచుచున్నాఁడు. అయ్యో అయ్యో ! ఏమియహితము సంభవించునో ? శ్రీరామ రామ ! ఇంకేమున్నది ?

గీ. రావణునకటారి యాఖగరాజుపక్ష
ములను ఖండించివైచి వే యిలను గూల్చె
పాపమని పాయమైనయాపక్షిరాజు
క్రూరశౌర్యుడౌ వీనిచేఁ గూలె నకట !

ఇఁక నాకు దిక్కెవ్వరు ? ఓగోదావరీపావనోదకంబులారా ! ఓవన్యసత్వంబులారా !

గీ. నృపకుమారులఁ మీకుఁ గన్పింప రాము
దేవిఁగొని లంకఁజేరిచె రావణాఖ్యుఁ
డనియును జటాయుదుస్థితి న్వినుచుఁడమ్మ
నాదువిధి యిట్లగుటచేతఁ బోముసమ్మ !

గీ. ఆరయక మంచిచెడ్డల సనిన నన్ను
వెంటనే కర్మఫల మిట్లు వెంబడించె
రంగదరిలోకగజహరి రామమూర్తి !
స్వామి నాయవజ్ఞ క్షమించి సైపుమయ్య !

(రావణుఁడు ప్రవేశించి సీతాసహితుఁడై రథముపై సాఁగును)

జా:– ఈనగంబున నెవరో దృఢకాయులగు కపు లైదుగు రున్నారు. నాజాడ వీరలవలననైన నాభర్త కెఱుకపడునటులఁ గొన్నిభూష ణముల నీచెఱఁగున ముడిచివైచెద. (తనపైటకొంగు చింపి కొన్ని యాభరణములఁ గట్టి వైచును.

(తెర వ్రాలును)

6. స్థలకము — శబర్యాశ్రమప్రాంతభూమి.

(కుశాస్తరణమున శబరి యాసీనయై యుండును)

శ:– శ్రీరామచంద్రా ! గురువర్యునాజ్ఞానుసారముగ నెన్నిరోజు లిటుఁ గనిపెట్టుకొనియుండుట ! రామభద్రా ! ఈదీనురాలి వింకను కరుణింపవా ? ఓ అనాధనాధా ! పతితపావనా! ఈనేత్రకుక్షులకు

రామచంద్రకరుణామృతస్వాతివర్ష మింక నెన్నటికి ? ఇంక నేను తాళఁజాలను. ఈదినము నీదర్శనభాగ్య మభావ్యమైనచో ... అకటా ! ఎంతపామరత్వము ! ఆదీనదయాళువుపైననా కోపము ? బాగుబాగు. నేను నామస్మరణయోగముచే నాపతితపావనుని ప్రత్యక్షముఁ జేసికొందును. "రఘుపతి ! రాఘవ ! రాజారాం ! పతితపావన ! సీతారాం" (తన్మయత్వమున స్మరించుచుండును) (చింతాక్రాంతుఁడైన శ్రీరాముఁడు మెల్లగా తెరప్రక్కనుండి ప్రవేశింప లక్ష్మణుఁడు వెన్నంటివచ్చును)

ల:- అన్నా ! కటుకుమాటలాడి జానకీమాత నన్నుఁ బంపుటయు, వెంటనే యామె రావణాపహృత యగుటయు, పరమోపకారి యగుజటాయువు మరణించుటయు, విధి దుర్నివార్య మనుటను స్థిరీకరించుచున్నవి. సర్వజ్ఞుల రగు మీరలే యిట్లు విచారించుచుండ నింక నోదార్పఁగలవా రెవరు ? ఉడుగుఁ డుడుగుఁడు. శాపవిముక్త కబంధవచననిర్దిష్ట మైనశబర్యాశ్రమ మిదిగనే తోఁచెడిని. ఆపరమతపస్విని దర్శించినపైని సుగ్రీవాన్వేషణమునకై కడంగుదము.

శ్రీ:- అనుజా ! జానకీవియోగదుఃఖపారావార మపరిమితమై దున్న వామై యలంఘ్యమై కనుపట్టుచున్నను తమకార్యమైనఁ ద్యజించి యన్యకార్యఘటనము ధీరోదాత్తలక్షణముకదా ? శబరీసందర్శనమునకై మనము వేగిరించుచున్నది. ఇదియే యాయాశ్రమము కానోపును. కనుఁగొనుము.

ల:- మహాప్రసాదము. అదిగో యారామనామస్మరణ సేయుచున్న యామెయే శబరి కానోపును.

శ:- (పులకాంకితగాత్రయై లేచి) ఆహా ! రామచంద్రమూర్తీ ! భక్తపరాధీనా ! నామొఱాలకించి సానుజుండవై వేంచేసితివా ! ధన్యాస్మి. ధన్యాస్మి. రండు. రండు. (పాద్యములఁ గొని యెదురు వచ్చును)

శ్రీ:- అనుజా ! చూచితివా ?

ఆ. జోరువల్కలంబు, జపమాల, పాద్యపా
త్రంబుఁ దెచ్చునావిధంబు నామె
పారవశ్యమును, దపంబుఁ బూజ్యులయెడఁ
బరమభక్తి దెలియఁబలుకవొక్కొ ?

ల:- అగ్రజా ! అగును. ఏమిభక్తి ! ఏమిభక్తి !

శ:- శ్రీరాముని పాదములఁ గడిగి జలము తలపైఁ జల్లుకొని వల్కలము చెఱఁగునఁ దడినొత్తి) మహాత్ములారా ! నేఁటికి నే ధన్యను.

శ్రీ:- సాధుశీలా ! శబరీ ! నీతపము నిర్విఘ్నముగ సాఁగుచు సఫలమగుచున్నదా ? గుర్వాజ్ఞానుసారముగ నాహారనియమమున కాలముఁ గడపుచున్నావా ? నీకు సుఖమేకదా ?

శ:- పరమాత్మా ! శ్రీరామచంద్రమూర్తీ ! భవద్దర్శనమొనరింప నాకైమె జ్ఞానప్రదుఁడగు గురువాక్యానుసారము ప్రవర్తించువారివిధముగ సఫలమనోరథులు కాక వేఱేనుగుదురు ? ఇవిగో పరీక్షితమృదుమధురవన్యఫలములఁ గొన్నిఁటిని తమకై తెచ్చియుంచితిని. వీనితో నాయాత్మార్పణ మొనర్చుచున్నదాన. వానిని పరిగ్రహించి యీదాసురాలి ననుగ్రహింపుఁడు. (నమస్కరించి ఫలములతోఁ బ్రవేశించి భయభక్తులతో శ్రీరామున కొసఁగుచు) సర్వం శ్రీరామార్పణ మస్తు.

శ్రీ:- (పండ్ల నొక్కొకదానిని రుచిచూచుచు) తమ్ముఁడా ! నీవు కొన్నింటిఁ దినుము. ఇది నీవ్రతభంగము సమకూర్పఁజాలదు. కావున స్వీకరించి భక్షింపుము.

ల:- మహాప్రసాదము (అని స్వీకరించి తిన నారంభించును)

శ్రీ:- అనుజా ! ఎట్లున్నవి ?

ల:- అగ్రజా ! మీమెప్పు గనినవి యెవరిని సంతుష్టినొందింపవు? అతిరుచ్యములుగ నున్నవి.

శ్రీ:- సౌమిత్రీ ! సత్యము. సత్యము. తపస్విని ! శబరీ !

గీ. భక్తితో నీ వొసంగినఫల మొకొక్క
టిదియె నొక్కొక్కభువనంబు నిడినయేని

కలుగకుండెడిమోదం బకామ్యకర్మ
ఫలము లిట్టివె నీవాంఛఁ దెలుపు మవ్వ !

శ:- మహాత్మా ! నా కేటివాంఛ కలదు ? తాము చిత్రకూటమున నుంటిరనియు నాకు దర్శనమొసంగి కడతేర్తురనియు నాగురువర్యుఁడగు మతంగముని వచించి దివంగతుఁడగుచు నాకాలము నిరీక్షించుచుండ నియమించె. ఇన్నిదినములనుండి వేచియుండ నానోము నేఁటికిఁ బండెను. కర్మానుభవానుసారమగు ఏలోకమునం దుంచి నను అనవరతభవత్పదధ్యానమునకు నాకొం డేల ? అటు లనుగ్రహింపుఁడు.

శ్రీ:- అవ్వా ! నీవు కర్మందానినే తిరిగి వాంఛించితివిగాన నాయీవి యేమికలదు ? నీ వనంతసుఖనిలయం బగుపరమపదమున నను నిరంతరము స్మరింప ననుగ్రహింపఁబడితివి.

శ:- ధన్యాస్మి. ధన్యాస్మి. ధన్యాస్మి. ఇంతకంటె నా కేమికావలయును ! ఇఁక నాకాజ్ఞ యీరా ?

శ్రీ:- అవ్వా ! సుఖముగ నేగిరమ్ము. (ఒకవైపునకు శబరియు మఱియొకవైపునకు శ్రీరామలక్ష్మణులు నిష్క్రమింప నారదుఁడు ప్రవేశించును.)

నా:- కలహాశనుఁడనగు నా కిఁక కొంతకాలము నిత్యపర్వము. శనైశ్వరుఁడు కానుపించి తనసభూమికను జయప్రదముగ నటించి జనకజాపహారణ మొనరించితి ననినదాని కదిగో దక్షిణాభిముఖుఁడై గగనంబునఁ బఱచుచున్న జానకీద్వితీయుఁడైనరావణుఁడును శబరీమోక్షణ మొసంగి యేతెంచుచున్న నుశ్రీరామలక్ష్మణులు దీనావనంబులే సాక్ష్యములు. నే నిప్పట్టున వీరికంటఁ బడరాను. రామరావణకలహామే నాకు పర్వము. అది రానున్నదికదా ! కలహబీజము నెలకొల్పఁబడినందున నిప్పటి కొకచిన్న వందువు. ప్రస్తుతమిం కేమికావలయును. సాధులోకకల్యాణమే భూసురాశయము కావున నిట్లగుఁగాక.

# శ్రీరామప్రవాసము

## భరతవాక్యము.

మంగళమహాశ్రీ.

ధారుణిని భూపతులు ధర్మపథవర్తనన
దల్చెదరు నాస్తికజనాళిన్
ధీరవరు లాశ్రితుల దీనతను వోనడచి
తీఱుతురు గాత కుజనాళిన్
భూరమణు లన్యసతిపొందు మదిఁ గోరకయ
పొల్చెదరు గాత నిరతంబున్
వీరులకధాళి పృథివీపతులమన్నలఁ
బెంపెసఁగ మంగళమహాశ్రీన్.

## గద్యము.

ఇది శ్రీరామచంద్రనిర్వ్యాజకరుణాసాదితకవితాదిరాజమానహారిత
సగోత్రోద్భవాపస్తంబసూత్ర ఆదూరి వంశపయఃపారావార
రాకాసుధాకర కేశవార్యపుత్త్రి వేంకటరామానుజాచా
ర్యాండాళాంబాప్రియపుత్ర శ్రీరామచంద్రపాదారవిందేం
దిందిరాయమాణ మానస శ్రీవైష్ణవపాదరేణు
వేంకటరంగస్వామికవిప్రణీత
శ్రీరామప్రవాసము
సంపూర్ణము.



చంద్రికా ముద్రాక్షరశాల, గుంటూరు.

## గ్రంథకర్తగారిచే రచియింపబడిన

# యితర గ్రంథములు.

1. సింగరాద్రిమాహాత్మ్యము గీతకావ్యము 0—4
2. శ్రీరామబాల్యము పురాణనాటకము 0—12
3. శ్రీరామోద్యోగము [అచ్చులోనున్నది.]
4. శ్రీరామ విజయము ”
5. శ్రీరామ ప్రస్థానము ”
6. విజయసింహ (రాయచూరుయుద్ధము) చరిత్రాత్మకనాటకము.

## క్రొక్కారు.

జలదంకి కృష్ణస్వామిశర్మ విరచితమైన ఖండకావ్యము. ఆంధ్ర సారస్వతమును పునరుజ్జీవింపఁజేయుచున్న అభినవభావములను గను డు. తేనియసోనలతో నానిన సెలయేటిపాట! మురళీనినాదము! వల్లకీ గానము! సుప్రసిద్ధులగు పండితులచేఁ బ్రశంసింపఁబడినది. వినుఁడు ఆనందింపుఁడు. వెల రు. 0—5—0 మాత్రమే. పోస్టేజి ప్రత్యేకము. వలయువారు గ్రంథకర్తపేర వంగవోలునకు వ్రాసినఁ బడయఁగలరు.

వలయువారు:—

1. ఆదూరి వేంకటరంగస్వామి అయ్యంగారు,
   శ్రీరామానుజభవనమ్,
   కొత్తపేట - గుంటూరు.
2. పి. వి. రమణయ్య అండ్ సన్,
   అరండల్ పేట - గుంటూరు.

